# శుకసప్తతి కథలు




అక్కా! ప్రభావతీ! ఇక కథను విని పొమ్ము.

ప్రకాశకులు:—

ఈశ్వర బుక్ డిపో,

రాజమండ్రి.

# శ్రీనాథకవిచరిత్రము.

గ్రంథకర్త:- ఆకుండి వెంకటేశ్వర్లుగారు.

ఆంధ్రభాషకు ననువాదకవితాప్రవాహములో నన్నివిధాలా అందాలు తీసికొచ్చి రసములు ముంచెత్తి యాంధ్రకవితారాజ్యమునకు సార్వభౌమపట్టము గట్టుకొన్నవాడు శ్రీనాథుడు. ఇతఁడు కవులు సాధారణంగా దరిద్రులౌతారనే యపవాదమును తెనుగుదేశములో నుంచి తఱిమినాడు. రెడ్డిరాజులసభలందు కనకాభిషేకం చేయించుకొని బంగారుతూగుటుయ్యాలలో కవితాదేవితో గలిసి యూగులాడినవాడు. శృంగారరసమునందలి సారమునంతను యాంధ్రక్షేత్రమున వెదజల్లి కవితాధాటియను నాగలిచే దున్ని చాటుపద్యంబులనే చెఱుకుమొక్కలు నాటి ప్రబంధేక్షుపర్వంబుల తెనుగువారికి కందించినాడు. దక్షిణాధీశుని ముత్యాలశాల దీనారటంకాల తీర్థ మాడించి గౌడడిండిమభట్టు కంచుఢక్కను బగులగొట్టించి యపత్రాక సెనాడు. మహాభోగంబుల నందినాడు. కంటకగుపడ వన్నెలాడైన దటి నిలువుటద్దమున కవితాచిత్తరువులందు తన కవితాశక్తి భావమున యంతా ప్రసరిము (మీరా) లేఁయే తెనుగువాకిట చిత్రరూపమున నిలబెట్టినాడు. ఇమ్మహాకవిచరిత్ర చదివి తెలుసుకొనవలెను తెనుగువారు మాయీగ్రంథమునే చేతబట్టిన సఫలీకృతమనోరథులౌతారు. మేము చెప్పుటకన్న మీరే తెలిసికొనుట మంచిది. శ్రీనాథుని కవితాపేషణియందలి పద్యాగ్రగణమునం దొక్కరత్నమును మచ్చున కిచ్చుచున్నాము.

క॥ పూజారివారికోడలు
తా జాఱఁగ బిందె జాఱి దబ్బునఁ బడియెన్
[illegible]జాఱుకొంగు దడిసెను
బాజాకే తిరిగి చూచి పక్కున నవ్వెన్.

వెల రు. 1—0—0.

కరా) అచ్చయ్య అండ్ సన్సు, ఈశ్వర బుక్కుడిపో, రాజమండ్రి.

# శుకసప్తతి కథలు

గ్రంథకర్త:—

పండిత. మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి.



ప్రకాశకులు:—

కర్రా అచ్చయ్యా అండు సన్సు,

ఈశ్వర బుక్కు డిపో,

రాజమండ్రి.

1937.

వెల రు 1-0-0.

# మనవి - మాటలు.

ఈశుకసప్తతికథ లీనాటివి కావు. ఏనాడో సంస్కృతభాషలో నమోఘముగ పుట్టి పెరిగినవి. మాతృభాషయగు సంస్కృతమునుండి రసమును వెదజల్లు నీకథ లాంధ్రానువాదమున నీరసంబు లైనవి. అయినను వీని కాంధ్రలోకమున నాదరణము మొందు. అక్కారణమున నెందరు ప్రకటించినను పునఃప్రకటన మావశ్యకమైనది. ఈకథలు తెనుగునాడులో ప్రఖ్యాతి నందుటకు ప్రధానకారణ మందలిశృంగారరససమ్మిళనమే. వీనిం జదువుటవలన నిట్టినీతి యుదయించునని చదివినగాని బోధపడదు. అయినను తెనుగువచనగ్రంథముల లన్న నతిహేళనమును జేయు నీకాలములో నింకను నిట్టిరచనలను గావింపించి నూతనపద్ధతులతో ప్రకటింపించి యాంధ్రభాషాసేవను జేయుప్రకాశకులకు ధన్యవాదము లిచ్చి ముగించుచున్నాను.

ఇట్లు

గ్రంథకర్త.

# విషయసూచిక.





# శుకసప్తతికథలు.



## అవతారిక.



శ్రీమహాదేవుండును కైలాసనివాసుండును నగుశంకరుఁ డొక నాఁడు కైలాసపర్వతమున సంతసముగొలువుండ నాఁటిరాత్రివేళ పార్వతీదేవి తనమనోహరుని గాంచి 'ఓస్వామీ! భూలోకమందలి వింతలను వివరించుకథలను గొన్నిటిని విన వేడుకగా నున్నది. వినుపింపు' మని యడుగ నంత శంకరుఁ డిట్లు చెప్ప నారంభించెను. ఓకాంతామణీ! తొల్లి భూమండలమునందు విక్రమార్కుండను నొకమహారాజు కలఁడు. అతని కుజ్జయిని రాజధాని. జనానురంజకుఁడు. కాళికాదేవి దయవలన పరకాయప్రవేశవిద్య నభ్యసించినాఁడు. తన రాజ్యమునందలి స్థితిగతుల నరయుట కతఁడు రహస్యసంచారము నడపుచుండువాఁడు. అప్పట్టణమున నొకకంసాలి కలఁడు. వానికిగూడ పరకాయప్రవేశ మనువిద్య తెలియును. ఆకంసాలికడ నొకపొట్టేలున్నది. దానితో పోరాడగల పొట్టేలు భూతలమున లేదని వాఁడు డాబులు కొట్టువాఁడు.

విక్రమార్కుఁడు వాని దంభములను గాంచి తనచే పెంపబడు పొట్టేలు నాతని పొట్టేలుతో డీకొన చేసెను. అవి రెండును పోరాడు చుండ రాజు పొట్టేలునకు బలము క్షీణించెను. రా జాయదను గనిపట్టి తనశరీరము నొకచో దాచి పరకాయప్రవేశవిద్యచే నాపొట్టేలు శరీరమున జొచ్చి పరాక్రమముతో బోరాడుచుండెను. కంసాలి యీసంగ

తిని గ్రహించి, తనదేహమును నటకీవైచి తాను రాజకళేబరమున బ్రవేశించెను. వెంటనే కోట కరిగి రాచకార్యములను విచారించి విక్రమార్కుని భార్యను పొందు నిచ్ఛతో నంతఃపురమునకు బోయెను. ఆమె లక్షణంబులనుబట్టి యన్యునిగా గ్రహించి యొకవ్రతంబు నాకు గలదు. దాని నారుమాసములలో పూర్తి జేసినపిదప గలియుదు నని చెప్పి రహస్యముగా విక్రమార్కుని వెదకింపుచుండెను.

విక్రమార్కుడు తనబలముచే కంసాలిపొట్టేలునుజంపి తనదేహమునకు వెదకగా నది గాన్పింప దయ్యె. అంత నత డొకనదీతీరమున బచ్చిపడియున్న చిలుకయొక్క కళేబరమున జొరబడి యాకాశమార్గమున సంచరించు చిలుకలగుంపుతో దిరుగుచుండెను. ఒకనా డొక వనంబున మామిడిచెట్లు బాగుగా పండ్లతో నిండియుండెను. ఆప్రాంత మందలి యొకబోయ ఫలములతో నిండినమామిడిచెట్టుపై వల పన్నెను. అది యెరుంగక చిలుకలగుంపా చెట్టుపై వ్రాలినది. వలలో చిలుక లన్నియు చిక్కుపడి యేడ్చుచున్నవి. అపు డీచిలుకరూపముతో నున్న రాజు "శుకములారా! విచారింపకుడు. ఆపదలు వచ్చినప్పుడే ధైర్య ముండవలయును. కావున మనము తప్పించుకొనుట కొకయుపాయము జెప్పెదను. అట్లు చేయుడు. ఏమందురా; బోయవాడు వచ్చువేళ యయినది. మనమందరము అతడు వచ్చువేళకు చచ్చినట్లు క్రింద బడి యుందము. వాడు మనలను చచ్చితి మనుకొని లెక్కపెట్టుచు క్రింద నుంచును. నూరు లెక్కకు రాగానే ఒక్కుమ్మా రెగిరిపోవుదము" అని చెప్పెను. చిలుకలన్నియు చచ్చినట్లు పడియున్నవి. బోయవాడు వచ్చి వాని నొక్కొక్కటిగ లెక్కపెట్టి క్రింద పెట్టుచుండెను. 99 లెక్క కాగానే యన్నియు నెగిరిపోయినవి. ఒక్కచిలుక మిగిలిపోయినది. అది విక్రమార్కుడే. దానిని బట్టి వాడు చంపుటకు యత్నింపగా

నాచిలుక "ఓవేటకాడా! నన్ను చంపినందున నీ కేమిలాభము? సమీపమందలి పట్టణమునకు గొనిపోయి నన్ను విక్రయించితివా వలసినంత ధనము వచ్చును." అని పలుక వా డాచిలుకను ఏకద్వీపంబను నగరమునకు గొంపోయి యొకవర్తకునకు నూరువరాల కమ్మెను.

ఆవర్తకు డాచిలుకను పంజరమం దుంచి యింటియెదుటి చావడిలో నుంచెను. ఆచిలుకకు రత్నపరీక్షయు బేరసారములును తెలియును. అదంతయు జూచి వర్తకుడు దాని నెంతో ప్రేమగ పెంచుచుండెను. వానికి ప్రభావతి యనుభార్య కలదు. చిలుక వచ్చిననాట నుండి వర్తకము విరివిగా జరుగుచున్నందున హాయిగా కాలము గడపుచుండెను. ఆపట్టణమునకు రాజు ఉత్తుంగభుజుడు. ఆతనికి రూపావతీ కళావతులను నిరువురు భార్య లుండిరి. అందు రూపావతి కొకకుమారుడు. ఉత్తుంగభుజుడు పెద్దభార్యను పుత్రునితో దూరముగా నొకచో నుంచి నిరంతరము కళావతితో నుండి రాజ్యపాలనము చేయుచుండెను. వర్తకు డొకదినమున లక్షవరహాల విలువగల చీర నొకదాని నమ్మకమునకు రాజుకడకుదీసికొనిపోయెను. కళావతి దానినికోరెను. రాజంత డబ్బుపెట్టి కొనవద్దనినాడు. అట్టిరాజే చీరకొనలేకపోయెనే యని విచారించుచు వచ్చుచుండ రూపావతిదాసి యాచీరను జూచి దానిని తన యజమానురాలికి జూపి ఖరీదు లక్షరూపాయి లనెను. అంత నామె నవ్వి మన ప్రస్తుత పరిస్థితులలో నివి యెందుల కన్నది. అంత నాదాసి;

శ్లో. ఉత్తుంగభుజనాశో వా దేశకాలగతోపి వా।
వణిగ్వరస్య నాశో వా నందో రాజా భవిష్యతి॥

అమ్మా! డబ్బుకై చింతింపకుము. ఆరుమాసములలో నీవచ్చును. మీకుమారుని పేరుతో పత్రము వ్రాసి యిచ్చి తీసికొనుడు. ఇం

తలో ఉత్తుంగభుజుడేనా చావడా? వర్తకుడేనా చావడా? అని చీరవ్రుచ్చు
కొని తనయజమానురాలి కిచ్చెను. ఆమె మూడుదినంబులు చీరను కట్టి
విడువగా దాసి యాచీరను గైకొని కళావతికడకు బోయినది. కళా
వతి యాచీరను జూచి యాశ్చర్యపడి నీ కీచీర యెక్కడిది అన్నది? మా
రాజు దయయుండ మా కేమి లోటు అనినది. అంత కళావతి యుగ్రు
రాలై రాజును దూషించి దాసిని గెంటించి యంతఃపురమున కేగి యు
రుపోసుక మరణించినది. రాజు వచ్చి కళావతిచావునిని తానాత్మహత్య
చేసికొనెను. ఆవార్త మంత్రులకు దెలియగా వారు రూపావతికుమారు
డైన నందిరాజునకు పట్టము గట్టిరి. నందిరాజు తలిదండ్రులకు ప్రేతక్రియ
లాచరించి రత్నాకరుని బిలిపించి చీర కేవలసినరొక్క మిచ్చి యింకను
బహూకరించి పంపెను. ఆరత్నాకరు డాధనములో గొప్పవర్తకమును
జేయుచుండెను.

ఇట్లు కొంతకాలంబు జరుగ నందిరాజు నదుయవ్వనంబుతో
భాసిల్లుచు విలాసముగ నతిరైభవంబున నేనుంగుపై వీధివెంబడి పోవు
చుండగా నారత్నాకరునిభార్య ప్రభావతి తనమేడనుండి మహారాజును
దిలకించి యతనిని మోహించెను రాజుకూడ నామెను గాంచి మో
హించి యామెతోడి విరహబాధ కాగకాలక నెట్లయిన నామెను పొంద
నిశ్చయించెను. రత్నాకరు డూర నున్నచో దనకు కార్యసాధనము కా
దని యెంచి వర్తకున కింకను గొంత ధన మిచ్చి యోడవర్తకమునకై
ప్రోత్సహించి దూరదేశ మంపెను. రత్నాకరుడు పోవునపుడు భార్యను
వదలలేక చిలుకతో బహుజాగ్రత్త సుమాయని చెప్పిపోయెను. ప్రభా
వతి భర్తయిల్లు వీడగనే నందిరాజుతో నెప్పుడు కలియుదునాయని యు
వ్విళ్లూరుచుండ నత డొకదూతను ప్రభావతికడ కంపెను. వాడు ప్రభా
వతితో నందిరాజు తన నంతఃపురమునకు దోడ్కొని ర మ్మని నటులజె

ప్పినంతనే యుప్పొంగి పన్నీట స్నానము చేసి సమస్తభూషణంబుల నలంకరించుకొని దూతవెంట బోవుటకు వచ్చుచుండెను. అప్పట్టున గృహమధ్యభాగమున పంజరమందున్న చిలుక "అమ్మా! నీవు పోవుకార్యము మిగుల ప్రమాదకరమైనది. రం కాడ నేర్చిన బొం కాడవలెను. దానికి ధైర్యస్థైర్యంబు లుండవలయును. నే నొకకధ చెప్పెద నాలకించి పొమ్మా" అని ప్రభావతి కిట్లు చెప్ప మొదలిడెను.

---

# మొదటి రాత్రి కథ.

## (జగన్మోహిని)

పూర్వకాలంబున కురుదేశంబున వంగపురమను నొకగొప్పపట్టణము కలదు. దానిని మాధవుడను రాజు పాలించుచుండెను. ఆరాజు కడ 'ఏకాంతవీరుడు' అను నొకసేవకుడు కలడు. వానిభార్య జగన్మోహిని. ఆమె మిగుల నందకత్తె. ఆరాజునొద్ద భీముడను వేరొకభటుడుండెను. అతఁడు జగన్మోహినిని కామించి యొకప్పు డామెభర్త యింట లేనిసమయమున తనకోరిక నామెకు దెలియపఱచెను. ఆమె నీవన్న నాకు మిగుల నానందమేకాని నాభర్త చాల కోపి. మన మాతనికంట బడిన మానప్రాణములు తక్కవు. నీవు వేగిరింపకుము. సమయము దొరకకమానదు. అవకాశము చిక్కగానే నేనే నీయింటికి వచ్చెదనని చెప్పి పంపెను.

భీముడును నందుల కంగీకరించి యదనునకు వేచి యుండగా నొకదినమున తెల్లవారుఝామున నేకాంతవీరుడు మేలుకొని నేను సూర్యోదయము కాకముందు బయలుదేరి గ్రామాంతరమునకు బోవ

లెను. నీవు వేడినీళ్లు పెట్టుము. తలంటుకొని పోవుదును" అని పలుక నామె యింటిలో చన్నీళ్లు లేవు. బావికి పోదమన్న చీకటి. ఇప్పు డేల్లు సరిపడును. అని యెంతచెప్పినను వినక స్నానము చేసి కాని పోవీలు లే దనెను. అంత నామె యింటిలోనున్న కొంచెమునీటిని సలసల కాగ నిచ్చి శరీరమునకు నూనె రాచి నలుగిడి యానీరు మీాద చిలికెను. ఇంత వేడినీరు నేను పోసికొన జాలను. చల్లనిసీరు తెమ్మని బావికి పంపెను. జగన్మోహిని గొప్పసంతోషముతో నీరు తెచ్చుటకు బిందెను చేదను బుచ్చుకొని బావికడకు జనుచు మార్గమధ్యమున యింటిలోనున్న భీము ని లేపి నీయిచ్చ దీర్చుకొమ్మని వానితో సరసాలాపంబు లాడి, సురత క్రీడల దేలి, తృప్తురాలై భీమునితోగూడ బావికడ కేగి బిందెకు త్రా డు కట్టి నూతిలో దిగి యాబిందె ప్పరొమ్ము నాని తాటిని చేకొనిపొ మ్మని భీమునకు జెప్ప వా డట్లు చేసి పోయెను.

ఏకాంతవీరు డెంతకును భార్య రానందున కోపించి వేడినీళ్లు చ ల్లారువఱ కుండి నీళ్లు పోసికొని బావికి బయలుదేరెను. తెల్లవారుజా మున నీటికై వచ్చిన స్త్రీలు బావిలో స్త్రీ పడినదని చెప్పగా నోరు నెత్తి గొట్టుకొనుచు నామెను పైకి దీయించెను. అప్పు డాజగన్మోహిని, నీరు తోడుచుండ కాలు జారి పడిపోయితి నని భర్తతో బలికెను. అంత నత డామెను బుజ్జగింపుచు నింటికి దీసికొనిపోయెను. ప్రభావతీ! నీవ ట్లుచేయు సాహసము కలదాన వైన నందిరాజుసన్నిధి కరుగుము. అని చిలుక కథ పూర్తి చేయువర కర్ధరాత్ర మైనందున నందరును నిద్రించిరి.

# రెండవ రాత్రికథ.

(కామిని)

రెండవనాటి యర్ధరాత్రిమున ప్రభావతి మిగుల శోభాయమానంబుగా నలంకరించుకొని మనోహరుండగు నందిరాజు సౌధమునకు బోవ ప్రయాణ మగుచుండ చిలుక యామెను బిలిచి 'బిడ్డా! నీవు పోవు కార్యము మిగుల దుస్సాధ్యముసుమా! నామాట వినుము. నీ కొక్కకథను చెప్పెద. ఆలకించి పొమ్ము.' అని కామినికథ నిట్లు చెప్ప నారంభించెను.

తొల్లి జగంబున మిగుల ఖ్యాతినొందిన కాశ్మీరదేశంబున చెంగల్వపుర మనునొక్క గొప్పపట్టణ మున్నది. తత్పురమున నన్నివర్ణములవారును గలరు. అందు వైశ్యు లధికము. ఆవైశ్యులలో మిగుల నైశ్వర్యవంతు లుండిరి. ఆధనవంతులలో సోమిసెట్టి యనునొక వర్తకుడు కలడు. అతని భార్యపేరు కామిని. ఆమె మిగుల సౌందర్యవతి, జాణ, ఆరితేరిన అమ్మలక్క, పదుగురిని బుట్టలో పెట్టగల గయ్యాళి. ఆనగరంబున నాయకుడు, కాముకుడు అను నిద్దరు బలిజీలు గలరు. వా రిద్దరును కామినిని ప్రేమించియుండిరి. అవకాశము చిక్కుట లేదు. ఒకదినమున సోమిసెట్టి తల్లి రెండురూపాయి లిచ్చి బియ్యము తెమ్మని కామినిని బజారునకంపినది. ఆమెయు మంచిసమయము దొరకెనని తనప్రియులకై వెదకుచు బజారునకు బోయి గంపలో బియ్యమును బోసికొని యటు నిటు జూచుచు నింటికి వచ్చుచుండెను. మార్గమధ్యమున కాముకు డామెను హఠాత్తుగా జూచి దేహ ముప్పొంగి మెల్లన, నామెవెనుకకువచ్చి కన్నులుమూసి నేడు నాకోరిక దీర్చినగాని పోనీయ

నని పట్టువట్టెను. ఆమె వానిని కొంతసేపు రతిక్రీడల నానందపఱచి రాబోవుచుండెను.

అంతలో నాయకుడు వచ్చి తనకోరిక దీర్పు మనెను. ఇప్పటికే చాలప్రొద్దు పోయినది. మ రొకప్పుడు తీర్తు నన వాడు కోపించి యామె గంపలోని బియ్యమును తాను మూట గట్టుకొని యామెగంప నిండుగ మన్ను వోసిపోయెను.

అంత నాకామిని యాతట్ట నెత్తిపై బెట్టుకొని గృహంబున కరిగి తట్ట నెత్తిపైనుండి దింపుకొని చూడగా నందు బియ్యమునకు బదులు మ న్నున్నది. ఆమన్ను జూచి యత్తగారు యిదేమే మన్ను దెచ్చితి వని యడుగ 'అత్తా! త్రోవలో నీవిచ్చిన రెండురూపాయిలును పడిపోయి నవి. ఏమి చేయుటకును దోపక యెంత వెదకినను దొరకనందున గంప లోని కీమన్ను నెత్తికొనివచ్చితి'నని బదులు పలికినది.

అత్తగా రామన్నును క్రిందబోసి యింతియేగదా జరిగినది. పోనిమ్ము. అని వెదకి యెందును రూపాయలు గనుపడనందున నెచ్చ టనో పారవేసినదని యూరకొనెను. ఓబిడ్డా! ప్రభావతీ! నీవుకూడ నీరీతిగా బొంకుటకు శక్తిగలదానవైన నీవు పోవుస్థలమునకు పొమ్ము. లేదేని పోవుట ప్రమాదకరము. అని ముగించుసరికి రాత్రి నిశీథమగుట వలన ప్రభావతి నిద్ర పోయినది.

---

# మూడవ రాత్రికథ.

## (విమలానందుడు)

మూడవనాటి రాత్రి ప్రభావతి యథాప్రకారముగ పన్నీట జలక మాడి చీనీచీనాంబరములను ధరించి కర్పూరాదులతో మిళితమైన

తమలమును పుక్కిట బట్టి, సింగారించుకొని వయ్యారముగ నాదూత వెంట నందిరాజాంతఃపురమున కరుగ ప్రయాణము సాగించుచుండ చిలుక "అక్కా! నీ వొకపరి యిటు రమ్ము. నీనాథు డింటలేనితరి నీవు రాజుకడకు బోవుచున్నావు. అత డీరాత్రియే యింటికి వచ్చిన నేమి సెప్పుదువు? దానికి సమాధాన మిచ్చుట కెంతయో సమయస్ఫూర్తి, ప్రజ్ఞాధురీణత, కల్పనాశక్తి మొదలగునవి యుండవలెను. ఇందుకు తార్కాణముగా నొకకథను వినిపించెద. ఆకథను సాంతముగ విని యట్టిసాహసౌదార్యంబులే నీ కున్నచో తప్పక నరుగుదువుగాక. విను మని యిట్లు చెప్ప ప్రారంభించెను.

అంగదేశము మిగుల ఖ్యాతి నందినది. అందు 'అవంతీపురము' అను నొకపట్టణము కలదు. ఆనగరమునందు సోమశర్మ యనునొకబ్రాహ్మణు డుండెను. అతనికి కృష్ణవేణి యనునామె యర్థాంగి. ఆదంపతులకు 'లీలావతి' యనునొక కుమార్తె యుండెను. ఆమె రూపవతియు, విద్యావతియును నై యౌవనవతియై యుండెను. సోమశర్మ తనకుమార్తెకు వివాహము చేయ దలచి యెంత తిరిగినను తగిన వరుడు లభింపలేదు. ఇంతలో మగధదేశమునుండి యొకబ్రాహ్మణయువకుడు కాశీకి బోయి ఆరుశాస్త్రములను జదివి చతుర్వేదంబుల నభ్యసించి కావ్యనాటకాలంకారాదుల నర్థసహితముగ దెలిసికొని యింకను క్రొత్తవిద్యల నేర్వదలంచి యవంతికి వచ్చెను. సోమనాథశర్మ రాజకోటనుండి వచ్చుచుండ నొకచో నీయువకు డొకపండితునితో వాదన జేయుచుండెను. పూర్తి యగువఱకు శర్మ యుండి యువకుని జయమ్మును గ్రహించి యతనివాగ్ధాటికి సంతసించి తనయింటికి విందునకు బిలచెను. వారు భోజనము చేయుచుండ సోమశర్మ యువకుని జూచి "తమ దే దేశము? ఇట కేల వచ్చితి" రని యడిగెను. ఆయువకుడు తనజన్మస్థానము మగ

ధదేశమనియు పదియేండ్లు కాశిలో విద్య నభ్యసించి యచటి పండితుల తో వాదనలు సల్పి జయ మంది విద్యయం దింకను కీర్తులు నేర్వద లచి యిచటకు వచ్చినట్లుగా దెలిపెను. సోమశర్మ మిగుల సంతసించి తనకుమార్తె నతనికి వివాహము చేయుదు ననెను. దాని కా సుందర శాస్త్రి యొప్పుకొనెను. శర్మ బంధువుల నందఱ రావించి యైదుదినంబు లును మిగుల శోభగా వివాహ మొనర్చెను.

సోమశర్మకు దగ్గరబంధువులగు శారదయు విద్యానందుఁడును తద్వివాహమునకు వచ్చిరి. వివాహపు నాల్గవదినమున విద్యానందుఁడు భార్యయందు చిత్తము తగిలి మోహావశుఁడై కామము నాపుకొనలేక యామె నదికి స్నానార్థ మరిగినపుడు వెంటఁబోయి తనకోరిక నామెకు దెలిపెను. ఆమె నేను పదిమందిలో పరుండియుందునుకదా! ఎట్లు పొస గును? రెండురాత్రు లోపిక పట్టలేరా? యనెను. విద్యానందుఁడు దీను డయ్యెను. అంత నామె నేను రాత్రి సావడిలో పరుండి నాతలక్రింద నానవాలుగ నొకపీట నుంచుకొందును. దానిని జాగరూకతతో గమ నించి దీప మార్పి లోనికి వచ్చి మీకోరిక దీర్చుకొను డని చెప్పెను.

ఆదంపతు లట్లు మాట లాడుకొనుచుండ నాసమీపమందున్న మఱ్ఱిచెట్టునెక్కి యాకులను గోయు బ్రహ్మచారి యొక డామాట లా లించి యారాత్రి పెండ్లివారింటికి భోజనమున కరిగి యచ్చటనే పరుండి యందరు నిద్రించిన వెంటనే విద్యానందునికంటె ముందుగా చావడిలో ప్రవేశించి పీటను గుర్తించి దీప మార్పి విద్యానందునిభార్యతో గ్రీడిం చి వెడలిపోవుచు నాపీట నాప్రక్క నిద్రించు నొకవృద్ధురాలి పాదము లకడకు ద్రోసి పోయెను. ఒకగంట దాటినపిదప విద్యానందుఁడు సావడి లోనికి వచ్చి దీప మారిపోయినందున తడుముకొనుచు పీటను గుర్తిం

చి యావృద్ధురాలిపై బడెను. ఆమె దొంగ దొంగ యని కేక లిడెను. విద్యానందు డపు డించుక ధైర్యము నొంది 'ఏడీ దొంగ పట్టుకొనుడు' అని వీధిలోనికి బర్వెత్తి కేకలిడెను. దొంగ పారిపోయె ననిరి. విద్యానందుడు భార్యపై కోపముతో నుండి యొకచో పరుండి నిద్రించెను.

మఱునాటియుదయమున విద్యానందుడు మరల భార్యతో నదికి స్నానార్థ మరుగునపుడు "రాత్రి పీట నావృద్ధురాలిపాదములకడకు గొంటి న న్నవమానపఱుతువా" యని కోపించెను. ఆమెయు తనతో నెవరో క్రీడించి రని తెలిసికొని తననేరము బయల్పడ కుండుటకై, 'చాలుచాలును నాపాదములందలి అందెలనైన గుర్తించుకొనక పొరపాటున నా వృద్ధురాలిపై బడి పైన నన్ను దూరుచుంటిరా!' యని పలికెను. దానికి విద్యానందుడు సిగ్గుపడి గృహమున కరిగెను.

"ప్రభావతీ! చూచితివా? శారద యెట్లు తప్పించుకొన్నదో! నీ కట్టి నేర్పు కలదా? ఉన్నచో రాజుకడ కేగుము" అని చిలుక పలుక నామె మఱునాడు వత్తు నని దూత నంపినైచి నాటికి నిద్రించెను.

---

# నాలుగవ రాత్రి కథ.

## (నారాయణశర్మ)

ప్రభావతి నాల్గవనాటిరాత్రి యథాప్రకారముగ సర్వాభరణ భూషితయై మహోత్సాహముతో రాజుతో నెపుడు క్రీడింతునా యను నాతురతతో దూతవెంట బయలుదేరి రాజాంతఃపురమునకు బోవనుండ చిలుక "అమ్మా! నీవు పోవుపని మిగుల సాహసురాండ్రు చేయవలసి

నది. నేనొకకథచెప్పెదను దానిని విని పొమ్ము” అని యిట్లు చెప్పుట కారంభించెను.

కాంభోజదేశమునందు కేదూరను నొకయగ్రహార మొండెను. దానియందు సుమారు నాలుగువందల బ్రాహ్మణగృహము లున్నవి. అందు నారాయణశర్మ యనునొక ద్విజసత్తము డుండెను. అతఁడు వేద వేదాంగాదివిద్యలను అష్టాదశపురాణములను జదివెను. పాండిపంటలు, సిరిసంపదలును సమృద్ధిగా నున్నవి. అతఁడు యౌవనమున కృష్ణవేణి యను నొక స్త్రీని పెండ్లియాడి యనేకవిధంబులయిన భోగంబుల ననుభవింపుచు నెంతకాలమునకును నామెకు సంతతి కలుగనందున కృశాంగి యనునొక స్త్రీని పునర్వివాహము చేసుకొనెను.

అతఁ డా రెండవభార్యతో కామోపభోగంబులం దేలుచు వ్రతములను సల్పుచు దానంబులను నిరతాన్నప్రదానముల నాచరింపుచు కాలము వెళ్ళించుచుండ నామె కొకమగశిశు వుదయించెను. అంతట నుండి కృశాంగి భర్తతో రతిక్రీడం దాన లేనటుల నటింపుచు పరపురుషులయిన యువకులను జూచి మోహింపుచు తనయింటనున్న సమస్త భాగ్యంబుల నాయువకుల కిచ్చుచు సమయము వచ్చినపు డెల్ల వారితో కామోపభోగంబులను దేలుచుండెను. కృష్ణవేణి వయసు తీరినదగుట దూరముగా నొకయింట నుండెను. ఇట్లుండ నొకనాటి యర్ధరాత్రిని ప్రతిదినము కృశాంగితో క్రీడించు బ్రాహ్మణయువకుడు మన్మథబాధ కాగజాలక విరహాతురుడై నారాయణశర్మ యింటి ముందు తిరుగుచుండెను. అంత నారాయణశర్మ హరినామస్మరణ మారంభించెను. ఆయువకుడు శర్మగారిని మేల్కొలిపి అయ్యా! నేను కొలచిన కామశాస్త్రిగారి కొమారుడను. అగ్ని కొంచెము కావలసి

వచ్చినది. అని యడుగగా నారాయణశర్మ హరినామస్మరణ విడువలేక భార్యను లేపి బ్రాహ్మణయువకున కేమి కావలెనో చూడు మనెను. ఆమెయు తలుపు తెఱచి యేమి కావలెనని యడుగ యువకుడు రతి సౌఖ్యమును గోరెను. ఆమె వానిని వెంట బెట్టుకొని పడకటింటికి గొనిపోయి మంచమున కొక చివరభాగమున పండుకొమ్మనెను. కృశాంగి భర్తకప్పు డెట్టుల సమాధానము నిచ్చినదో చెప్పగలవా యన ప్రభావతి నన్నడుగకుము. నీవే చెప్పుమన్నది.

కృశాంగి యువకుని పాన్పుపై పరుండబెట్టి భర్తతో, నాథా! నే నగ్నిని దెచ్చుటకై పోయి యచట కుక్కను తాకితిని. స్నానము చేయువఱకు న న్నంటకుండు. దూరముగా నుండు డనెను. నారాయణ శర్మ దూరముగానుండి హరినామస్మరణ చేసికొనుచుండెను. కృశాంగి తనపుత్రుని కాలిగజ్జలు మువ్వలు తీసి యువకునకు గట్టి యతనితో రతిసౌఖ్య మనుభవించుచుండెను. ఆగజ్జలు మొదలగునవి ధ్వని జేయు చుండ నాసందడి యేమని శర్మ యడుగగా మన యబ్బాయి లేచి ఆడుకొనుచు కాళ్ళ నిటు నటు కొట్టుచు గంతులు వేయుచు నాడు చున్నాడు. అని పలుక శర్మ మిగుల సంతోషముతో, ఆడుకొనుము నాయనా! నాముద్దుబిడ్డా యని చప్పటలు వేయుచు హరినామస్మరణ చేయుచుండెను.

కృశాంగియు హాయిగ సురతక్రీడలం దేలి యువకునకు వలసి నంత ధన మిచ్చి పంపెను. ప్రభావతీ! నీవు కూడ నట్లు బొంకగలవేని నందిరాజు సౌధమున కరుగుమని చిలుక కథ ముగించుసరికి చాల రాత్రియైనందున రేపు వచ్చెద నని దూత నంపి ప్రభావతి గాఢనిద్ర నొందెను.

---

# అయిదవ రాత్రి కథ.

## (సుమతి)

ప్రభావతి మఱుసటినాటిరేయి మరల యథాప్రకారముగ నలంకరించుకొని రాజాంతఃపురమునకు బోవ పయన మగుచుండగా చిలుక అక్కా! నేను చెప్పబోవు కథను విని మరియు పొమ్మని యిట్లు చెప్ప మొదలిడెను.

అంగదేశమున కళింగపురమను నొకపట్టణంబు కలదు. అందు ననేక భాగ్యవంతు లగువర్తక శ్రేష్ఠులు కలరు. వారిలో నృసింహగుప్తయను శ్రేష్ఠి మిగుల ధనవంతుడును శాంతమూర్తియు నై యుండెను. అతనికి సుమతి భార్య. ఆమె మిగుల నందకత్తె కాకపోయినను కురూపిణి కాదు. ఆమెకు చాలకాలమునుండి సంతతి లేదు. సంతానమునం దామె కెక్కుడాసగా నుండెను. తాను తల్లి కావలెనను నాసకు తన పాతివ్రత్యమును బలి చేయ నిశ్చయించెను.

ఇట్లుండ నెచ్చటనుండియో రామచంద్రశర్మ యనునొక పేద బ్రాహ్మణుడు సూర్యోదయాత్పూర్వ మాకళింగపురమునకు వచ్చి నృసింహగుప్త మేడప్రక్కనుండి పోవుచుండెను. అప్పటికి సుమతి వీధి వాకిలి నూడ్చి కల్లాపు చల్లుచుండెను. శర్మ పేదయైనను రూపవంతుడును విద్యావంతుడును నై యుండెను. శర్మ గుప్తసౌధముకడ నాగి యాగృహ మెవరి దని ప్రక్కవాని నొకని నడుగుచుండెను. అపుడు సుమతి వారిసంభాషణ నాలించుచు నిలబడెను. శర్మ యిది యొకధనికుని యిల్లని తెలియుటతోడనే యామేడకు సరాసరిగ పోయి నిలచి 'అమ్మా! మీ రీయింటివా రేనా?' యని ప్రశ్నించెను. నే నీయింటి

యజమానురాలు నని బదులు పలికి యంతతో నూరకుండక శర్మ క్షేమ సమాచారముల నరసి కూర్చుండ నియమించి గుర్తుగారూర లేరనియు వారముదినములలో వత్తురనియు లోనికి దయసేయుడనియు గౌరవించి భోజనాదికముల నేర్పాటుచేసి తనయింటనే యుంచుకొనెను. నాటి రాత్రి సుమతి తన సంతానవాంఛను దీర్చుకొనునుద్దేశముతో శర్మను పిలిచి యతనితో కామోపభోగంబుల దేలెను. మఱియు భర్త వచ్చినవెంటనే యీ లోకమహాపండితులనియు నాకు సంతానప్రాప్తి కలుగుటకై జపము చేయ వీరిని నియమించితిననియుం జెప్పెను. అతడును సంతసించెను.

సుమతి భర్తకస్సప్పి యతనితో రతిసౌఖ్యంబుల దేలుచు నొక దినమున నతనిని వీపుపై నెక్కించుకొని గృహకృత్యములను నెరవేర్చు చుండెను. అంత నామెభర్త వచ్చి ఇదేమే! పరాయిమగవాని నిట్లు సిగ్గులేక వీపుపై నెక్కించుకొని త్రిప్పుచున్నావు. అని యడిగి యామె పై సందేహముతోనుండి రోకలితో మొత్తబోయెను. ప్రభావతీ! ఆమె బ్రాహ్మణునకును తనకును యేహానియు నాకుండ నెట్లు తప్పించు కొనవలెనో చెప్పుమని చిలుక యడిగెను. నాకు దెలియదు. నీవే చెప్పు మని సుమతి యనగా నాచిలుక ప్రభావతీ! సుమతి పెనిమిటిని జూచి నా కీయవస్థ నీమూలముననే వచ్చినది. కల్యాణపురప్రభువు యింటి పన్ను లివ్వరివారిపై నీవిధముగా పరపురుషుల నెక్కించు మని యాజ్ఞ చేసెను. నామీద పరపురుషు డెక్కుచుండ చూచుచు నూరకుంటివి. ఇది నిజమో కాదో యిరుగుపొరుగువారి నడుగు మనెను. అంత గుప్త పొరుగుననున్న పున్నయ్యగుప్తతో మీరందరు పన్ను చెల్లించి నారా? పన్ను చెల్లింపనిచో పరపురుషుని భార్యపై నెక్కింతురట యనగా నివేమి మాటలు? ఇ దెక్కడివింత? ఇ దెక్కడ వినలేదే?

ఎచ్చట జరుగుచున్న దన నేను పన్ను లీయలేదని నాభార్యపై పర పురుషు నెక్కించిరి. రండు చూడుడని తన యింటికి దీసుకొనివచ్చెను.

ఇంతలో శర్మను సుమతి దాచెను. పున్నయ్యగుప్త నృసింహ గుప్తభార్య నిదేమివింత యని యడిగెను. ఆమె నాభర్తకు నారుమాస ములక్రిందట పిచ్చియెత్తినటులనే యిప్పుడును పిచ్చిపట్టినది. ఇది చికిత్స చేసినగాని తగ్గ దన్నది. ఆమాటలకు భర్తకు గోపము వచ్చి మరింత మండిపడెను. ఇరుగుపొరుగువా రామాటలను నమ్మి రాజున కెరిగించి యతని చేతులకు సంకెలలు దగిల్పించి యింటిలో బంధింప జేసి చికిత్స చేయించు చుండిరి. సుమతియు శర్మయు గుప్తయెదుటనే యతులరతు లను దేలుచుండువారు. గుప్త మఱింత యెక్కుడుగా నిదుగో పరపురు షుడు నాభార్యపై నెక్కుచున్నాడని కేక లిడువాడు. అతనిమాటల నెవ్వరును జెవిపెట్ట లేదు. అంత నాతఁడు భార్యతో నాసంకెలలు వద లింపజేయవే? నాకు పిచ్చి తగ్గినదని బ్రతిమాలెను. అంత నామె నే నీపరపురుషునితో కామక్రీడల ననుభవించుటకు నడ్డుపెట్టకుండ నుంటి వేని నీసంకెలల విడిపింతు నన్నది. గుప్త యంగీకరించెను. ఆమె భర్త సంకెలల దీయించి బుఱ్ఱ గొరిగించి నిమ్మకాయరసముతో తలంటి పాగాను జుట్టి యంగడిలోనే యుండి తిండికి మాత్రమే రమ్మని యాజ్ఞాపించి శర్మతో హాయిగా రాత్రింబవళ్ళు భోగించుచు కొలది దినములలో గర్భవతియై తేజశ్శాలియగు నొకపుత్రరత్నమును గనినది. గుప్త యాపుత్రుని నిరంతర మంగడిలో నుంచుకొని ముద్దులాడుచు కాలమును గడపుచుండువాడు. నీకుగూడ నట్టియుపాయములచే దప్పిం చుకొనుట చేతనైనచో రాజాంతఃపురమున కరుగు మనెను. అప్పటికి నిశీధ మయ్యెను. ప్రభావతి వచ్చిన రాజదూతను రేపు వత్తునని రాజుతో జెప్పి పంపివైచెను.

---

# ఆఱవ రాత్రికథ.

## (ఇద్దరు బోయవనితలు.)

ప్రభావతి మఱునటిదినంబున నెట్టి స్త్రీవిముఖునకైన వలపు బుట్టించుతీరున నలంకరించుకొని నందిరాజుకడకు పోనుండుటకు సిద్ధమగుచుండగా చిలుక ప్రభావతీ! నాచెప్పబోవుకథను విని పొమ్మని యిట్లు చెప్పుట కారంభించెను.

పశ్చిమాంధ్రదేశము చాలవఱకు బోయలతో నిండియుండును. అందొకబోయపల్లెయందు సుముఖ దుస్సుముఖ యనునిరువురు బోయెతల గలరు. వారొకదినమున వాగునకు నీటికై పోయి వచ్చుచుండిరి. వారి కొకయందగాడగు బ్రాహ్మణయువకుడు గాన్పించెను. తోడనే వారతనిని మోహించి మీదేయూరనియు నెటకు బోవుదు వనియు నడిగిరి. అంత నతఁడు నాది బెంగుళూరు కాపురము. కాలినడకను కాశీపట్టణమునకు బోవుచున్నా ననెను. అంత నావనితలు చాల ప్రొద్దెక్కినది. దగ్గఱగా నూరేదియులేదు. మాయింట వంటచేసికొనుటకు స్వయంపాక మిత్తుము. భోజనము చేసి పొమ్మనిరి. అత డందుల కంగీకరించి వచ్చెను. వానికి సమస్తవస్తువులును సప్లయిచేసిరి. భుజించిన పిమ్మట నతనిని దగ్గఱి సరసముల నాడ వానికిని గొంత యుద్రేకము కలిగెను. అపుడు వారొకరితో నొకరు సంప్రతించికొని దొడ్డిలోని తోటలోని కరిగి రతి సౌఖ్య మనుభవించుచుండిరి. సుముఖ క్రీడల దేలునప్పుడు దుస్సుముఖ కావలిగాయును. దుస్సుముఖ రతిసౌఖ్యమున నుండ సుముఖ కావలి కాయును.

ఇట్లు వీ రాబ్రాహ్మణునితో రమించుట నాయింటి యజమాని యెఱుంగడు. అతఁడు ప్రొద్దుటనే చద్దియన్నమును దిని పొలమున కరిగి

మద్దెకూటికి వచ్చి పదునిమిషములలో తిండి తిని మరల పొలమున కరిగి సంజకడ వచ్చును. ఒకనాడు మధ్యాహ్నము భుజించి బోయవాడు పోయెను. వీరు పెరటిలోని కరిగి రతిక్రీడల దేలుచుండిరి. ఇంతలో బోయ యొకచింతకొమ్మ చేకొని హఠాత్తుగ వచ్చెను. అప్పటి కింటిలోనే సుముఖయు బ్రాహ్మణ యువకుడును కామక్రీడల నడుపుచుండిరి. దుస్సుముఖ వాకిట నుండెను. అపుడు దుస్సుముఖ భర్తకు దాహమును దెచ్చి యిచ్చుటకు బోయెను. సుముఖ తల విరియబోసికొని వచ్చి బోయను పెపడి 'నీవు చిరకాలమునుండి గుంటయొడ్డుననున్న నా చింత కొమ్మ నేల తెచ్చితివి? నేను బ్రహ్మరాక్షసిని. ఆచింతచెట్టుపై నుంటిని. నీకొంప మాపెదను.' అనగా నాకు తెలియక తెచ్చితి నని బోయ దవడలు వాయించుకొనెను. చింతకొమ్మ నెటనుండి తెచ్చితివో యచట నుంచిన నీకు మంచి దగును. అని చెప్ప వాడు గొప్పభయభక్తులతో నాకొమ్మ నట విడిచి స్నానము చేసివచ్చెను. వీరిద్దరును చాలినంతవర కాబ్రాహ్మణునితో సుఖించి వానిని పొమ్మనిరి.

ప్రభావతీ! చూచితివా? ఎట్లు వారు తప్పించుకొనిరో? అట్టి నేర్పు నీకున్న నీవు చేయదలంచిన పని చేయవచ్చునని చెప్పునప్పటికి నిశీథ మగుట నామె రేపు వత్తు నని రాజపుత్రునకు కబురంపి నిద్ర జెందినది.

---

# ఏడవరాత్రికథ.

## (హరిశర్మ)

మఱునటినాటి రాత్రి ప్రభావతి నిండుగ శృంగారించుకొని రాజాంతఃపురమునకు దోవ దీయుచుండ పంజరమం దున్నచిలుక యా

మెను బలుకరించి నాచెప్పుకథను సాంతముగ విని పొమ్మని యిట్లా
రంభించెను.

పరిభావతీ! దక్షిణదేశమందు రుదగ్రవరమను నొక యగ్రహార
ముండెను. అందలి బ్రాహ్మణకుటుంబముల కెల్ల వన్నెదెచ్చునది హరి
శర్మయిల్లు. అతని కేలోటును లేదు. కాని మిగుల కామి. మొదట
నతఁడు తనమేనమామకూతును వివాహమాడి యామెతోఁ గొంత
కాలము సుఖించెను. అతనికి కామోపశమన మామెయందు కానందున
శుభాంగి యనువేరొకతెను వివాహమాడెను. ఆమెయు మిగుల
కామిని. హరిశర్మ మొదటి భార్యను రుదగ్రవరమందే యుంచి ద్వితీయ
భార్యతో నొకశీతలమైన పట్టణమున కరిగి యట నివసించుచు నిరంతర
మామెతో రతిసౌఖ్యమున దృప్తుడగుచు నుండెను.

హరిశర్మ దేశదేశములనుండి వచ్చినవిద్యార్థులకు దనయింటనే
భోజనమిడి చదువు చెప్పువాడు. అతనికడ చాలమంది శిష్యులుండిరి.
అందులో ప్రసాదను నొకవిద్యార్థి మిగుల రూపవంతుడును చురుకు
దనముగలవాడును కలడు. శుభాంగి తనభర్త వృద్ధుడైనందున నతని
వలన రతిసౌఖ్యమున తృప్తిలేక ప్రసాదును మనంబున తలంచుచు నత
నికి సుఖకరంబులగు పనులను గల్పించుచు నాతని సంగమమునకై సమ
యమును జూచుచుండెను. ప్రసాదు యీసంగతిని కనిపెట్టి యుండెను.

ఒకదినమున హరిశర్మ శిష్యులకు పాఠములను జెప్పుచు నొక
తాటియాకుల గ్రంథము మిద్దెమీద కలదు తెమ్మని ప్రసాదు నంపెను.
అదనునకై వేచియుండిన శుభాంగి ప్రసాదుతో మిద్దెపై కెక్కి యతని
తో రతిసౌఖ్య మందుచుండెను. శర్మ యెంతకును శిష్యుడు రానందున
లోనికరిగి భార్యను తలుపు తీయుమనెను. అంత నామె ప్రసాదును

భయపడవలదని తాటియాకులగ్రంథమునకు గట్టిన సూత్రమును దెంపి యాపత్రముల నిల్లంతయు విరజిమ్మి తలుపుదీసి ఆహా! పుస్తకమును దెచ్చుటకు మంచిశిష్యునే పంపితి. ఎట్లుచేసినాడో అని పలుకుచుండ ప్రసాదు గడగడ వణకుచుండెను. హరిశర్మ శిష్యుని భయపడవలదని హెచ్చరించి పత్రముల నన్నిటిని క్రమప్రకార మేర్పరచి గ్రంథమును తయారుచేసెను.

ప్రభావతీ! శుభాంగి తప్పించుకొనినటుల నీవుకూడ తప్పించు కొనగలిగినచో నీచేయదలంచిన పని చేయనచ్చునని చెప్పునప్పటికి చాలరాత్రి యగుటయు నామె ప్రయాణము చాలించి నిద్రించెను.

---

# ఎనిమిదవ రాత్రికథ.

## (లావణ్యమయి)

నేటిరాత్రి ప్రభావతి మరింత యానందచందముల నమందముగా దిద్ది నందిరాజుకడ కేగ నిశ్చయించుకొని పయన మయ్యెను. చిలుక యామెను గాంచి నీవు చేయదలంచినపని చేయవచ్చును. అడ్డు దగులు వా రెవరు? అయినను నాచెప్పబోవుకథను మాత్రము విని పోవుట నాయిష్ట మనెను. ఆమెయు చెప్పవలసినదని నిలబడెను. అపుడు చిలుక:-

ఓకాంతాలలామా! సౌరాష్ట్రదేశమున గుణపతియను నొక పురంబు గలదు. ఆపురము రాజధానిగా నాదేశమును చిత్రరాజకుడను రా జేలుచుండెను. అతనికడ నొకపురోహితుడు కలడు. అతని కుమారుడు మిగుల కామియై వేశ్యాలోలుండై పితార్జితం బంతయు వెలయాండ్రకిచ్చి దరిద్రుడయ్యెను. ధనము లేకపోయినను అలవాట్లు

తప్పిపోవుగదా? క్షణక్షణమును వానికి ధనము కావలసియుండెను. అందు లకై యుపాయాంతరము లేక దొంగతనము చేయ నిశ్చయించి యితర తావులందు జేసిన యాశ తీరదని రాజగృహంబునఁ జేయ నిశ్చయించు కొని యారాత్రి సాధనసామగ్రితో రాజగృహంబున బ్రవేశించెను. వానిని రాజభటులు పట్టుకొనిరి.

రాజతనిని బ్రాహ్మణుఁడు దండనార్హుండు కాడు కాన వీని చేతులకు సంకెలల దగిల్చి విడువు మనెను. వారట్లు చేసిరి. ఆబ్రాహ్మ ణుండు సంకెలలతో పురవీధులందు హాయిగా సంచరింపుచుండెను. రాజనగరమున కావలియుండు ప్రలాపకుఁడనువానిభార్య మగడెప్పుడును రాజసేవకుఁడైనందున నతనివలన సౌఖ్యంబులను బడయనేరక పరపురు షాపేక్షకలదై యీబ్రాహ్మణయువకుని జూచి మోహించి యుండెను.

ఇట్లుండ నాయువకు డొకదినమున దాహంబుచే పీడింపబడి లావణ్యమయిని కోరెను. ఆమె వానికి దాహ మిచ్చి కష్టసుఖంబు లడిగి లోనికి దీసికొనిపోయి సంకెలలు విప్పి వానికి తలంటి శుభ్రవస్త్రము లిచ్చి తానును అభ్యంగన మాచరించి సరిగంచు చీఱగట్టి భూషణం బుల దొడగి వానితో రమించెను. ఇట్లు ప్రతిదినము జరుగుచుండగా నొకదినమున వీరు రతి సల్పువేళకు ప్రలాపకుడు వచ్చి తలుపు తీయు మనెను. లావణ్యమయి జంకక బ్రాహ్మణుని మంచముక్రింద నుంచి భర్తకు తలుపు తీసి, నాథా! ఇన్నినా ళ్ళొంటరిగ నన్నుంచి పోతిరే? ఎట్లుండగలను? నన్ను భూతంబులు వచ్చి బాధింపుచున్నవి. ఇప్పుడే మీకేక విని భూతములు పారిపోయినవని యనుచుండగా బ్రాహ్మణుడు క్రింద నున్నాడుగాన మంచపుకోళ్ళను పైకెత్తెను. అంత నామెయు మఱింత భయపడ ప్రలాపకుడు దయ్యములు దయ్యములని కేక

లిడుచు పారిపోయెను. ఈసమయములో బ్రాహ్మణుండును తప్పించుకొని పోయెను.

ప్రభావతీ! చూచితివా లావణ్యమయి చాతుర్యము? అట్టి ప్రజ్ఞ నీకున్నచో రాజాంతఃపురమున కరుగుమని పలుకువఱకు తెల్లవార వచ్చినందున ప్రభావతి నాటికి ప్రయాణము మాని నిద్రించెను.

---

# తొమ్మిదవ రాత్రి కథ.

## (విజయసేనుడు)

ప్రభావతి మఱుసటినాటి సాయంకాలమునకు యథాప్రకారముగ శృంగారించుకొని యతిశీఘ్రగ రాచనగరున కేగ పయనంబు కాగ నా శుకరాజం బామెను బిలిచి నీచేయదలంచుకొనిన పనిని చేతువుగాని యీకథనుమాత్రము విని పొమ్మని యిట్లు చెప్ప మొదలిడెను.

తొల్లి కాశ్మీరదేశమును విజయరంగనాధుడను రాజు పాలింపుచుండెను. అతనికి లేక లేక నొకపుత్రు డుదయించెను. అతనికి విజయసేనుడని నామకరణ మొనర్చెను. లేకలేక పుట్టుటవలన నతిగారాబమున జూచుచు విద్యాబుద్ధులం దశ్రద్ధ వహించెను. ఆకారణమున నత డవివేకిగా మెలంగుచుండ తండ్రి కోపపడెను. దాని కత డలిగి దేశాటనమున కై పారిపోయి కురుక్షేత్రంబు మొదలగు నుత్తమక్షేత్రంబులను దర్శించి మరల తనరాజధానికి పయనమై పోవుచుండెను. మార్గమధ్యమున నుద్యానవన మొం డతనికి గాన్పింప మార్గాయాసమును దీర్చుకొనుటకుగా నం దొకవృక్షమునీడ విశ్రమించెను. చల్లగాలి వీచుట నిద్ర బట్టెను. ఆవనమునకు గావలియుండు కాపువానిభార్య తోటలో

నికి వచ్చి నిద్రించు రాజపుత్రుని గాంచి మోహించి యతనిని లేపి తనకుటీరమునకు దీసుకొనిపోయి తనకోరికను దెల్పి యతనితో మన్మథ క్రీడల దేలుచుండెను.

ఇంతలో నామెభర్త యింటికి వచ్చి ద్వారము తట్టెను. అప్పు డామె రాజపుత్రుని భయంబు మాన్పి నాభర్తకు నేను ద్వారమును తీసినవెంటనే మంచముపైనుండి క్రింద కురుకుదుము. నీవు కత్తి ఝళి పించుచు నా వెంట నురికి పారిపొమ్మని చెప్ప వా డట్లు చేసెను. ఆమె భర్త పాదములపై బడి నన్నింట నొంటరిగా విడచిపోతిరి. వీరు డొకడు నాకు పొంగలి పెట్టెదనని మానిరి. నిన్ను జంపెదనని బెదరించు చుండెను. నాబ్రతు కేమిచెప్పుదును. అని యేడ్వ నతడు భార్య నూర డించి పొంగలి రేపమావాస్యరోజున పెట్టుదమని యూరడించెను.

ప్రభావతీ! ఆమె యెట్లు తన వ్యవహారము సరిచేసికొనినదో గమనించితివా? అట్టి తెలివితేటలు నీకున్న నీవును కార్యమును కొన సాగించుకొనుమని చెప్పుసమయమునకు నిశీథ మగుట నామె ప్రయాణ మాపి నిద్రించెను.

---

## పదియవనాటిరాత్రికథ.

### (రుద్రదేవుడు)

మరుసటినాటిరాత్రి ప్రభావతి యథాప్రకారముగ నలంకరించు కొని రాజసౌధంబున కేగుచుండ చిలుక యామెను బిలిచి యీకథను వినినపిమ్మట నీయిష్టము వచ్చినటుల పోవచ్చునని కథ నిట్లు చెప్ప దొడంగెను.

రమణీమణీ! దక్షిణదేశమునందలి రాజ్యభాగములలో నేపాళ దేశము గొప్పది. దానికి మయూరపురము రాజధాని. దానిని పాలించు రాజు మహాదాత. అతం డనేకాగ్రహారములను బ్రాహ్మణులకు దానములనిచ్చెను. అందు శ్రీరామపురమను నగ్రహార మొకటి కలదు. అందు రుద్రదేవుఁడను శ్రోత్రియబ్రాహ్మణు డుండెను. అతనిభార్య వినయశీలయగు శీలవతి. మిగుల రూపవతి. ఒకదినంబున నామె బుజమున బిందె పెట్టుకొని గోనేరుకు నీటికి పోయి వచ్చుచుండెను. ఆమె సహజమగు నొయ్యారింపునడకతో సన్నమువంగిన నడుముతో నడుగులు తడబడ నడచుచుండ నకాస్మాత్తుగా నామె కొక మన్మథస్వరూపుడగు యువకుఁ డెదురయ్యెను. ఆమె యతనిని జూచినంతనే లజ్జాపరవశ యగుటయే గాక కామపీడితయు నయ్యెను.

శీలవతి వెంటనే తనశీలమునందలి వివేకతను, పరిశుద్ధతను వీడి మదనాంధకార మగ్నయై బుజముపై నున్న బిందెను దింపుకొనుట కాయాసపడుచున్నట్లు నటించెను. పరోపకారపరాయణుఁడగు నాయాగంతుకయువకుడు సహాయము చేయదలంపుతో చేయూత కావలయునా? యని యడిగెను. అంత నామె యింతకన్ననా యని సమాధానమిచ్చెను. అయ్యువకు డామెకు బిందెను దింపుచుండ నుభయుల శరీరములు స్పర్శవలన పులకరించినవి. ప్రత్యుపకారము నావలన మీకేమగునని యతనిని క్రీగంట చూచెను. తమ రాగంతకులు వలె నున్నారు. ఈనాడు మాయింటి కతిథిగా నుండకూడదా యనెను. అతడు నందలియర్థమును గ్రహించి సాయంకాలమునకు వత్తునని యిల్లు గుర్తు చూచుకొని పోయెను. అతడు సాయంసమయమున కాయింటిసమీపమునకు రాగానే ఆమెబావా! ఎచ్చటనుండివచ్చుచున్నావు? లోనికి రమ్ము. అత్త బాగుగా నున్నదా? కాళ్ళు గడిగికొనుము. దాహము

కావలెనా యని ప్రశ్నించుచు తనభర్తతో నితఁడు నామేనత్త కుమారుఁడు. మనయింటిబంధుత్వమును వెదకికొనుచు వచ్చినాడు. మీరు పొలమునకు బోయి కూరనారలను తెండు. అని భర్తను బయటకు బంపి యాయువకునితో సరససల్లాపము లాడుచు నుండెను.

భర్త యిలుసేరగనే షడ్రసోపేతముగ వంటచేసి భోజన మిడి యతనికి వీధిచావడిలో పక్కవేసి తాము లోపల పరుండిరి. ఆమె యెట్లయిన నీరాత్రి యువకునితో క్రీడింపనున్నదిగాన పడకటిల్లు చేరగనే మగనితో తగవులాట కారంభించి నగలు లేవు చీరలు లేవని పోరాటమును బెంచెను. అంత రుద్రదేవునకు గోపము వచ్చి రెండు తన్ని మెడ పట్టి వీధిసావడిలోనికి గెంటి తలుపు బంధించుకొనెను. శీలవతి మిగుల సంతసించుచు నాయువకుని లేపి యతనితో మన్మధక్రీడల నారాత్రియంతయు గడపి తెల్లవారుజామున శోకింపుచు వీధివాకిట గూర్చుండెను. ఇంతలో యిరుగుపొరు గమ్మలక్కలు వచ్చి యిదేమని యడుగ నాభర్త తన్ని గెంటివై చినాడని చెప్పినది. అందటును రుద్రదేవుని చీవాట్లు పెట్టి యింటిలోని కామె నంపిరి. ఆమె తప్పించుకొనియటుల నీవుకూడ నేర్పరితనమున తప్పించుకొన గలిగినచో నందిజాంతఃపురమున కరుగు మని చిలుక చెప్పువేళకు చాల రాత్రియైనది. ప్రభావతి నిద్రించినది.

---

# పదునొకండవనాటిరాత్రికథ.

## (విశాలాక్షి)

ప్రభావతి మరల సాయంకాల మగునప్పటికి బాగుగా నలంకరించుకొని దూతతో రాజాంతఃపురమున కేగ సిద్ధమగు చుండెను. అంత

లో చిలుక యామెను బిలచి యీకథను విని పొమ్మని బ్రతిమాలి యాపి యిట్లు చెప్ప నారంభించెను.

ఆంధ్రదేశమునం దన్నివిధంబుల చేతను పేరెన్నిక గన్న మహాపట్టణము రాజమహేంద్రవరము. ఆపురమందు విస్తృతమ్ములు విశాలములునైన వీధులచే నిండిన పేటలెన్నియో కలవు. వానిలో నిన్నీసుపేటకు పిమ్మట గోదావరీ స్రవంతికి దిగువభాగమున మఠమున్న పేట ముఖ్యతమము. ఆపేటలో నారామ ద్రావిడు లధికులుగా నుందురు. వారిలో గంటి సుబ్రహ్మణ్యమనునొక బ్రాహ్మణోత్తముడు గలడు. అతడతి శాంతుడు. ఉదారుడు. పురుషకార మే హేతువున నాతనికి విధి సృజియించెనో చెప్పజాలము. అతని భార్య విశాలాక్షి. ఆమె సార్థకనామ్ని. మాటలుచెప్పుటలో నడక నడచుటలో నామె గయ్యాళియని తలంపవచ్చును. భర్త యొకసాహుకారి కడ నౌకరుగ నుండెను. వేతనము భుక్తికి మాత్రము సరిపడును. ఇతర సంపాదనములు లేమిం జేసి యామె నిరంతరము డబ్బునకై భర్తను బాధింపుచుండును. ఈమె యీసడింపులకు, కసరపు మాటలకు, మోసపు ప్రేమకు నాత డధీనుండయ్యెను.

ఆయింటి కెదురుగ నున్న వేదులవారి యింటిలో నొక బ్రహ్మచారి కలడు. అత డంతరూపసికాడు. సోమరి. వృద్ధురాలగు తల్లి తిండికై యాశించి యింటనుండును. విశాలాక్షి వానిని వలచినది. సుబ్రహ్మణ్య మిలువీడగనే తన వలపుకానిం జేరబిలచి యామె వానితో సరసాలాపముల నాడుచు రతిక్రీడల దేలుచుచుండును. ఈసంగతి నామె భర్త చూచాయగా గ్రహించినాడు. కనిపెట్టిచూచున్నాడు. కాని తన వృత్తికిని యీసమాచారమును గనుపట్టుటకును కాలవు లంగరి యందలేదు. ఒకదినమున వారిద్దరు నింటిలో నుండగా భర్త వచ్చి తలుపు

దీయుమనెను. అంత నామె తన వలపుకానిని భయపడవలదని యూరడించి తాను మడిగట్టుకొని యొక విస్తరిలో నన్నమును వడ్డించి వానిని భుజింపుచుండుమని బయటకు వచ్చి తలుపుదీసి, అంత కంగా రెండు లకు? లోపల నతిథికి భోజన మిడుచుంటిని. మన యింటి యెనుట వేదు లవారి యింటిలో నున్న కుఱ్ఱవాడు తల్లితో గలహించి మూడునాళ్లు నుండి యన్నములేక మూల్గుచుండ వానిని బిలిచి పట్టెడన్నమును బెట్టు చుంటిని. వడ్డన యగుసరికే మీారు వచ్చిరని బొంకి భర్త నూరడిలఁ జేసెను. అతడును లోపల ననుమానముచే గుందుచున్నను పైకేమియు ననలేక యూరకుండెను.

ప్రభావతీ! ఆమె పన్నుగడను గ్రహించితివా? ఆనేర్పు నీకడ నున్న నీవుకూడ నీవలపుకానిని జేరవచ్చునని చెప్పువఱకు నర్ధరాత్రము దాటుటయు నామె ప్రయాణము మాని నిద్రజెందెను.

---

## పన్నెండవనాటిరాత్రికథ.

### (లీలావతి)

ప్రభావతి యథావిధానముగ మరునాటి రాత్రి యలంకరించుకొని నందిరాజాంతఃపురమున కాతని దూతతో బోవ పయనమయ్యెను. అపుడు పంజరమందున్న చిలుక యామెను జూచి నీ వీ చెప్పబోవు కథను విని పొమ్మనెను.

చోళదేశమును సుజనాకర మను పట్టణమును రాజధానిగ జేసికొని శంతిదేవుడను రాజేలుచుండెను. అతని మంత్రి సుజనాకరుఁడు.

అతనికి లేక లేక నొకపుత్త్రుడు గలిగెను. అతని నామధేయ మయాచితుడు. సుగుణఖని. ధైర్యస్థైర్యముల కిక్క—. గాంభీర్యమునకు సంద్రము. అతనికి దేశాటనమం దభిరుచియెక్కువ. అక్కారణమున నతిడనేక తీర్థయాత్త్రలను చేయుచు దేశములందలి వింతల గనుచు దిరుగుచుండును. ఒకనాడొక తీర్థమున దంపతులు సరిగంగస్నానములను జేయుచుండిరి. ఆయాచితుడు కూడ నచ్చో స్నానమాడుచుండెను. స్నానానంతర మాయాత్త్రికులంద రందందుగల పర్ణశాలలందు వండుకొని భుజింతురు.

స్నానముచేయు నాదంపతులలో పురుషుడు మిగుల నమాయకుడు. స్త్రీ మిగుల చాకచక్యముగలది. రూపవతి. మరియు కామిని. ఆమెపేరు లీలావతి. అట్లగుట నామె తమకు సమీపమున స్నానమును జేయు మంత్త్రికుమారుని క్రీగంటం జూచుచు సైగలు చేసెను. అయాచితుం డది గమనింపలేదు. ఆమెమాత్త్రము భర్తనెట్లయిన కిశురించి మంత్త్రికుమారునితో రతిసౌఖ్య మనుభవింప తలంచియుండెను. అందులకుగా నామె తమ బసను మంత్త్రికుమారుని డేరాకు ముందుగ నుండు పర్ణశాలలో నేర్పాటుచేసెను. ఆమె భర్త సంభారములను దెచ్చుటకై గ్రామములోని కరిగెను. ఆసమయమున లీలావతి మిగుల విలాసముగ నామంత్రికుమారుని డేరా కెదురుగ నలంకరించుకొని కూర్చుండెను. మంత్త్రికుమారు డామె నపుడు తిలకించెను. తోడనే లీలావతి మునుసిగ్గునలేచి నిలంబడి చేతులు పైకెత్తి యావులించెను. అత్తఱి నామె కుచబంధము బిగువున పైక పిగిలెను. అది గనుచున్న మంత్త్రికుమారున కుద్రేకము గలిగి యామెను గూడదలంచి రాయబారము నడపెను. లీలావతి భర్త వచ్చువఱ కామె మంత్త్రికుమారుని డేరాలో

రతిక్రీడల దేలుచుండెను. అంత నతఁడు భార్యను వెదకుచు కేశలు వైవ నామె మంత్రికుమారుని డేరానుండి బయటకు వచ్చి తనకు తేలు కుట్టినదనియు నాబాధ నామహానుభావుడు మంత్రశక్తిచే మాన్పుచున్నాడనియు చెప్పెను. అతడును మంత్రికుమారునకు నమస్కారముల నర్పించి సంతోషమున నామెతో వెడలిపోయెను.

ప్రభావతీ! నీకుగూడ నట్టి వాక్చాతుర్యంబును సమయస్ఫూర్తియు కలదేని నీవు పోవుటకు సాహసింపుమని చెప్పునప్పటి కర్ధరాత్రి యగుట నామె ప్రయాణము మాని నాటికి నిద్రించెను.

---

# పదమూడవనాటిరాత్రికథ.

(తరళిక.)

వర్తకుని భార్య మరల సాయంసమయ మగువఱకు శృంగారము పూర్తి చేసుకొని తన వలపుకాడగు నందిరాజు కడ కరుగబోవు సమయమున చిలుక యామె నాపి నా యీచెప్పబోవు కథను వినిన పిమ్మట నీవు పోవచ్చునని చెప్ప నారంభించెను.

పాంచాలదేశమందలి మత్స్యనగరమును జనరంజకుఁ డనురాజేలుచుండెను. అతని భార్య సుశీల. ఒకనాటి రాత్రి యాదంపతులు సరససల్లాపము లాడుచుండుతఱి జనరంజకుఁడు భార్యతో, "రమణీమణీ! స్త్రీహృదయ మెట్టిదో యెఱుంగ నాసక్తి వొడముచున్నది" అని పలుక నామె ప్రాణనాథా! స్త్రీహృదయంబు నెఱుంగుట కాహరిహరాదులుగూడ నశక్తులు. మానవమాత్రుల కెట్లు సాధ్యము. అయినను ప్రాణప్రియులగు మీరు కోరితిరి కాన వినుడు. మనపట్టణము

నందలి రాజబాటకు సమీపమున నొకబావి కలదు. దానికడ కరిగి యొకగంటకాల మోపికబట్టి యుండిరేని సర్వమును మీకే తెలియ గలదు. అని పలికినది.

ఏవిధంబుగానైన తదగ్రహాస్యము నెఱుంగదలంచిన రాజు వెంటనే పోయి నూతికడ నిలబడెను. ఆబావికడనున్న స్త్రీలందఱును జనరంజకుని జూచిరి. అందు గొందఱు సిగ్గుపడిరి. మరికొందరు నీరుచేదు కొనకయే యిండ్లకేగిరి. మఱికొందరు పురుషులను లక్ష్యపెట్టనివారట నేయుండి యేమేమో మాటలాడుకొనుచుండిరి. ఆగుంపునుండి తరళిక యను నొకయువ్వని సాహసముతో జనరంజకుని సమీపించి రాజా! తమరిట నిలబడుట జూచి స్త్రీలు కలవరమందుచున్నారు. తామేల యిట నిలబడిరో తెలియఁ గుతూహలపడుచున్నాను. అని పలుక నారాజన్యుడు, కాంతామణీ! ఆమువాండ్రు మనసిట్టిదని యెఱుంగదలచి యిట నిలబడితినని పలికెను. మీకా కుతూహల మధికముగ నున్నచో పొద్దుగాని పొద్దున రెంటిమీద నెక్కి మూటిని చేతబట్టుకొని కత్తి కాడి సందున మానము గప్పెడి మద్దిచెట్టుకడకు వచ్చినచో తమకు సందేహానివృత్తి యగునని పలికి యామె శెలవుగైకొనిపోయెను.

జనరంజకుడు వెంటనే గృహంబున కరిగి తన భార్యతో నాతరళిక పలికిన మాటలను జెప్పగా నామె ప్రాణనాథా! ఆమాటకర్థము మీకు స్ఫురింపలేదా! ఆలింపుడు. పొద్దుకాని పొద్దనగా నర్థరాత్రము. రెంటి నెక్కుటనగా పాదరక్షలు ధరించుట. మూటినిచేత బట్టుకొనుట యన తమలపాకులు, వక్కలు, సున్నము చేతబట్టుట. కత్తి కాడిసందన కమ్మర కుమ్మరవాండ్ర యిండ్లకు మధ్య. మానము గప్పెడి మద్దిచెట్టన ప్రత్తిచెట్టు. ఆచెట్టున్న యింటికడకు రమ్మని పలికినది. అని చెప్పగానే రాజు మిగుల నివ్వెఱపడెను.

జనరంజకు డారాత్రి మేల్కొని నిశీథసమయమున పాదరక్షలను ధరించి తమలపాకులు వక్కలు సున్నము చేతబట్టి యానవాళ్లు సరిజూచుకొనుచు తరళిక గృహము గుర్తించెను. ఆమె భర్త చాల కాలము క్రిందట వర్తకమునకై కానిదేశముపోయి యారాత్రికే వచ్చెను. అందుచే నామె రాజుతో మాటలాడుటకు వీలుచిక్కక పోయెనే యని మిగుల విచారించెను. ఎట్లయిన రాజును మరొకతావునకు రమ్మని చెప్పవలయును గాన రాజు రాకడ కనిపట్టి తలుపుదీసి యొకసున్నపుముంత నాతనిపై బడునట్లు విసరి తలుపులను బంధించి లోనికేగెను. రాజంత యులికిపడి యామెచేత కర్థము తెలియక వెంటనే గృహమునకు వచ్చి యాజరిగిన సంగతి భార్యతో జెప్పి దీనియర్థ మేమని యడిగెను.

అంత రాణి యీమాత్రము గ్రహింప లేకపోతిరా? ఆమె సున్నపుముంత విసరుటచే కాళికాలయమునకు రమ్మని చెప్పినది. అనగానే రాజు తిన్నగా కాళికాలయమున కరిగెను. తరళిక భర్తకు పాద సేవ మొదలగు నుపచారములను జేసి నిద్రపట్టగనే బహురమణీయముగ నలంకరించుకొని కాళికాలయమున కరిగి రాజుతో సరిసల్లాపములాడి రతిక్రీడల దేలుచుండెను. రాజును తరళికయు మాటలాడుచుండుట రాజభటులు కనిపెట్టి యెవరో దుర్మార్గులు కాళికాలయమున బ్రవేశించి సరసములాడుచున్నారు. వీనినిబట్టి రాజున కప్పగించిన మంచిబహుమానము లభించునని వారు పైకివచ్చిన వెంటనే పట్ట వచ్చునని కాపుండిరి.

తరళిక తనభర్త లేచిన ప్రమాదము సంభవించునని రాజుకడ ననుజ్ఞవడసి యింటికిబోవుటకు బయటకువచ్చెను. వెంటనే రాజభటు

లామెను చుట్టుముట్టిరి. ఆమెయు కొంచెము చలించి ధైర్యమువహించి ఓభటులారా! మీలో నొక్కరు రాజాంతఃపురమునకు సమీపముగా బోయి 'ఆబోతు బందెలోంచిక్కుకొనెను.' అని మూడుమార్లు చెప్పి వచ్చిన మీకు మంచిబహుమాన మిచ్చెదనని పలికినది.

అందొకభటుఁడు రాజాంతఃపురసమీపమున కరిగి తరళిక చెప్పి నట్లరచెను. ఆమాటలు రాణి విని జరిగినదానిని దెలిసికొని వెంటనే యొకపళ్ళెరమున ఫలములను పుష్పములను బెట్టుకొని కర్పూరహార తిని వెలిగించుకొని కాళికాలయమున కరిగెను. లోన నెవరో దుష్టులుం డిరి పోవలదని భటులు వారించిరి. ఆమె యిది కాళికాదేవికి మ్రొక్కు తప్పక చెల్లించి తీరవలయును. అని లోనికేగి తాను ధరించిన దుస్తుల నాతరళికకిచ్చి యాపళ్ళెరమును దీసికొని పొమ్మని పంపెను. తరళిక వెడలిపోయెను. రాజభటులు దెల్లవారువఱకు వేచియుండి యాలయ మునుండి యుదయముననే బయటకు వచ్చిన రాజును రాణిని గాంచి యాశ్చర్యపడిరి.

ఈరీతిగా చిలుక కథముగించుటకు తెల్లవారవచ్చినది. అప్పుడు ప్రభావతి చాల పెద్దకథను చెప్పితివే? యని పడకటింటికిఁ బోయి నిద్రించెను.

---

# పదునాలుగవనాటిరాత్రికథ.

## (రేవతి.)

మరునాటి సాయంకాలము ప్రభావతి మరల నవరత్నాలంకార శోభితయై కలకలలాడు లేనవ్వు మొగంబున చిందులాడ రాజాంతఃపుర

మునకు బోవ పయనమై గృహద్వారము దాటుచుండ చిలుక అక్కా! నీమక్కువ నే నెఱుంగుదును. నీ విక్కథను విని మరిపొమ్మని యిట్లు జెప్ప మొదలిడెను.

కాంభోజదేశమున పాళిక యనునొక పట్టణముకలదు. దానిని చిరంజీవి యనురాజేలుచుండెను. అతనికడ బుద్ధిసాగరు డనునొక మంత్రి కలడు. అతని భార్య ప్రమధ. బుద్ధిసాగరునకు గొంతకాలము గడచిన పిమ్మట ప్రమధయన్న మిగుల నయిష్టత కలిగెను. అక్కారణమున మంత్రి రేవతియను నొకకాంతను పెండ్లియాడెను. బుద్ధిసాగరున కామె యారవప్రాణము. రేవతికి బుద్ధిసాగరునందు మమకారము లేదు. ఆమె పరపురుషులతో భోగింపవలెనని వాంఛకలదై తనయింటికి ప్రతి దినము వచ్చి దేవతాపూజ నొనర్చు బ్రాహ్మణయువకుని ప్రేమించి తనకోరిక నాతనికి దెలుప నతండును సమ్మతించెను.

వా రుభయులును సమయమును గనిపెట్టి ప్రతిదినము రతిసౌఖ్యము ననుభవించుచుండిరి. పెద్దభార్య యగుప్రమధకు పన్నెండేండ్లు వయస్సుగల యొకపుత్రిక కలదు. ఆమె తనపినతల్లి బ్రాహ్మణయువకునితో గలియుట కన్నులార జూచినది. ఒకనాడు పినతల్లి దగ్గఱనుండగా 'జనకా! నీ వొక్కడవే మాకు తండ్రివికావు. మరియొక తండ్రికలడు.' అనినది. అంత బుద్ధిసాగరుడు అతఁడెవడు యని యడిగెను. ఆమె యెద్దియో చెప్పనుండ రేవతి యేమియు చెప్పవలదని సంజ్ఞ చేసినది. తండ్రి యెంత యడిగినను లాభములేనందున నూరకుండెను. రేవతి నాటినుండి తన సవతికూతు నతిగారాబముతో జూచుచు నామె కేమి కావలయునన్న నది తెప్పించి యిచ్చుచుండెను.

బుద్ధిసాగరు డొకదినమున నొంటరిపాటున కూతును బిలచి అమ్మా! మొన్న నేదో చెప్పదలంచి మానితివి. చెప్పుమని బ్రతిమాలి

యడిగెను. అంత నా బాలిక మొన్నరాత్రి దీపపునీడలో నీప్రతిబింబము గోడపై కానుపింప తెలియక మరియొక తండ్రి యనుకొంటినని యబద్ధము పల్కి రేవతిపై నెట్టియనుమానము లేకుండ జేసినది.

ఇట్టి యుపాయములను నీనెరింగినచో జారత్వమును జేయుటకు సిద్ధపడుము. అని చిలుక చెప్పునప్పటి కర్ధరాత్రిమగుటు ప్రభావతి నాటికి నిద్రించినది.

---

# పదునైదవనాటి రాత్రికథ.

(కుంజరుడు.)

పదునైదవనాడు చీకటిపడకముందే ప్రభావతి నిండుగ సింగారించుకొని మిగుల హొయలు జూపుచు నందిరా జంపినదూత వెంట నంతఃపురమునకు బోవనుండగా చిలుక పిలచి ఈకథ మాత్రము విను పొమ్మని యిట్లు చెప్పుట కారంభించెను.

ఉత్తరకోసలమున రామభూపాల పురమనునొక యగ్రహారము కలదు. అందైదారువందల బ్రాహ్మణ గృహంబు లున్నవి. అందు కుంజరుడను నొకభూసురుడు కలడు. అత డన్ని విధంబులచేత నాయగ్రహారమునకు పెద్ద. నిరంతరము క్షేత్రయాత్రలను జేయుచు బ్రాహ్మణ సమారాధనల గావింపుచు నిరతాన్న ప్రదాతయని మంచివాడని పేరు గాంచెను.

కుంజరు డొకప్పుడు కాశీయాత్ర కరిగి తత్ప్రాంతమందలి క్షేత్రముల నన్నిటిని సేవించి రామేశ్వరమునకు బోవుచు మార్గమధ్యమ్మున

మంగళగిరిలో నాగెను. మంగళగిరిలో నిరతాన్నప్రదాతయగు నొక బ్రాహ్మణుడు కలడు. కుంజరుఁ డారాత్రి యా బ్రాహ్మణు నింటికి భోజనంబున కరిగెను. ఆయింటియజమాని కుంజరు నాదరించి షడ్రసోపేతముగ భోజనంబిడి పరుండజేసెను. కుంజరుడు లోకోత్తర సౌందర్యవతియగు నాయింటి యిల్లాలును గాంచి మోహితుఁడై నిదురలేక దొర్లుచుండెను. కుంజరుడు శయనించిన చావడియందే యాయింటిదంపతులు వేరు వేరు శయ్యలపై పరుండిరి. కొంతరాత్రి దాటువఱకు పెనుగాలివలన నాచావడిలోని దీప మారిపోయెను. అదియె యదనని కుంజరు డాయింటి బ్రాహ్మణునిభార్యపజ్జకు జేరి యామెతో రతిక్రీడ సలిపి తిరిగి తనస్థానమున బరుండెను.

మరికొంత సేపటికా యింటి బ్రాహ్మణుండు భార్యపక్కకు వచ్చి పరుండి యామెను కామక్రీడకు బురికొల్పెను. అంత నామె నాథా! ఇప్పుడేకదా రతిక్రీడ నలసితిరి. ఇంతలోనే యింత యాశయా? అని యడుగుటయు నాతఁడు నేనేమి? ఇపుడే వచ్చి రతిసేయుటేమి? అని తొందరపాటుతో నడిగెను. అంతె నాయిల్లాలు తన యింటికివచ్చిన యతిథివలన మోసము జరిగినదని గ్రహించి నాథా! నే నింతకుమున్న నొక కలగంటిని. అందు నేను తమతో రతిసౌఖ్య మంది పారవశ్యము నొందినటులయినది. ఆభ్రాంతియే నిజమని యిట్లు వక్కాణించితిని. మీకోరికను దీర్చుకొనవచ్చునని తప్పించుకొనినది. ఇట్టి చాతుర్యము నీకడ నుండెనేని నీవుకూడ జారత్వమునకు బోరవచ్చును. అని చెప్పునప్పటికి సగమురాత్రి దాటుటయు ప్రభావతి నాటికి ప్రయాణము చాలించి శయనించెను.

---

# పద్మనాలుఁవనాటిరాత్రికథ.

(భాండారమువారి కోడలు.)

మరునాటి సాయంకాలమున మరల ప్రభావతి మరుని గజ్జెల గుజ్జుమో యనునటు లలంకరించుకొని మిగుల నొయ్యారముగ రాజాంతఃపురమున కేగుచుండెను. అపుడు చిలుక అమ్మా! నా చెప్పబోవు కథను సాంతముగ విని పొమ్ము అనినది. ప్రభావతి కానిమ్మని నిలబడెను. అంత నా శుకరాజంబు:-

ప్రభావతీ! వినుము. మహారాష్ట్రదేశమున ఖంజపురమను నొక పట్టణము కలదు దాని యేలిక ధనపాలుడు. ఆధనపాలునికడ నయశీలుడను నొక మంత్రికలడు. వారి మైత్రి మిగుల యధికమై శ్లాఘాపాత్రమై నీరక్షీరముల కలయిక భాతి నుండెను. అదిచూచి చాలమంది యోర్వలే కుండిరి. కాని యాస్నేహమును విడపేయ నేరికిని శక్యంబు గాదయ్యె.

ఇట్లుండ నాపురమందలి వేశ్యాంగనలలో నతి జాణయగు కనకాంగి వారి మైత్రిని జెరుపనెంచి రాజసభ కరిగి తన గాన విద్యానైపుణ్యంబున వారల మెప్పించి వారిస్నేహమును సంపాదించినది. నాటనుండియు నామెయు వారికడ చనవధిక మగుట విస్తారముగ పోవుచుండునది. ఒకదినమున గానసభ ముగిసిన పిమ్మట ధనపాలుడు చూచుచుండ నయశీలుని బిలచి యతని చెవిలో 'వడ్లగింజలో బియ్యపుగింజ' అని చెప్పి వెడలి పోయినది.

అపుడు ధనపాలుడు నయశీలుని బిలచి మంత్రిసత్తమా! నీ కా కనకాంగి చెప్పిన రహస్యమేమని యడిగెను. మంత్రి వడ్లగింజలో బియ్యపుగింజ యన్నది. అంతకన్న నెక్కుడు చెప్పలేదనెను. ఆమాట

లను రాజు నమ్మక మంత్రి యబద్ధమాడుచున్నాడని నిశ్చయించి వెంటనే తలారులను బిలిపించి నయశీలుని నగరము వెలుపలనున్న యరణ్యమునకు జేకొనిపోయి చంపుడని యాజ్ఞాపించెను. తలారులు నయశీలుని యరణ్యమునకు దీసికొనిపోయి వానియందలి ప్రేమచే చంపక విడచిరి. నయశీలుఁడు నర్ధరాత్రమున కిల్లుచేరి యేరికిని దెలియకుండ గృహంబున నుండెను.

ఇట్లుండ నొకదినమున ధనపాలుఁడు వేటకు బోయి తిరిగి వచ్చుచు నొకయుద్యానవనమున కొలను సమీపమున విశ్రమించెను. అట కొకయువతి బంగారుపల్లకి నెక్కి వచ్చెను. ఆమె మిగుల యందకత్తెయగుట రాజామెను జూచి మోహవశుడయ్యెను. ఆమెయు గొంతసేపందుండి తిరిగి రాజు తనపై మక్కువ గలిగియున్నట్లు గ్రహించి వెడలిపోవునపుడు తన కాతనిపై వలపు గలిగినటుల దెలియబరచుటకు పసుపు, బెల్లపుముక్క, వెండ్రికలును ఒకయిటుక పెంకును గుడ్డను మూటకట్టి యట పడవైచి పోయెను. రాజామూటను జూచి దాని యాంతరంగికార్థమును గ్రహింపలేక మనస్సు వ్యాకులత నొంది గృహంబున కరిగెను. అక్కారణమున రాచకార్యములను జూచుట మానెను. ప్రజ లందఱును రాజుకడ కరిగి తమరిట్లు రాచకార్యములందశ్రద్ధ వహించితి రేలయని మొఱవెట్టుకొనిరి. ధనపాలుఁడు కుడిచి కూర్చుండి చేతులార నా కత్యంతమిత్రుఁడగు మంత్రిసత్తముని జంపుకొంటిని. నాకేదియో యావేదనగ నున్నది. రాచకార్యములందు శ్రద్ధ కలుగుటలేదు. అని తన యావేదనను ప్రకటించెను.

ప్రజలు మంత్రి జీవించియున్నటు లెఱుంగుదురు. అందుచే నపుడు రాజుతో ప్రభూ! తమ మంత్రి జీవించియేయున్నాడు. తమ దర్శనము నభిలషించుచున్నాడు. అని యతని నెదుటఁ బెట్టిరి. ధన

పాలుడు మంత్రిని జూచినంత నమందానంద కందళిత హృదయారవిందుడై కౌగిలించి ప్రజలను వీడ్కొల్పి రాచకార్యములను శ్రద్ధతో పరికించుచుండెను. నా డాయువతి తనకడ విడచినమూటను మంత్రికి జూపెను. నయశీలు డామూటను విప్పి "రాజోత్తమా! ఇందు పసుపుండుటచే వారింటిపేరు భాండారమువారనియు, బెల్లము కట్టినందున నామె నివాసము మధురాపురంబనియు, కేశము లిందుండుటచే సవరపువర్తకము చేయువారనియు, పెంకుముక్కనుంచుటచే వారిల్లు పెంకుటిల్లనియు గ్రహింపవచ్చును." అని యా సంజ్ఞను విడగొట్టెను.

అంత రాజు సంతసించి మంత్రితోగూడ మధురాపురమున కరిగెను. వారొక పూటకూటి యింట బసజేసిరి. మంత్రి యాపూటకూటింటి యజమానురాలిని బిలిచి, భాండారమువారి యిల్లెచ్చట? వారి కోడలి నెఱుంగుదువా యని ప్రశ్నించెను. అంత నాపూటకూటింటి యామె 'ఆమె నెఱుగకేమి? ప్రతిదినమును నే నామెకు పూలదండలను గ్రుచ్చి తీసికొనుపోవుచుందును' అనెను. అట్లయిన నీ వీదినమున పూవులు చేకొనిపోయి నప్పుడు నీవు కొలనుదగ్గఱ చూచినవారు వచ్చినారు అని చెప్పుము. ఆమెయు తోడనే పూవులను దీసికొనిపోయి యామె కిచ్చి మంత్రి చెప్పుమన్న మాటలు చెప్పెను. ఆమెయు నా మాటలు విని కోపము కలిగినట్లు నటించుచు నరటిపట్టతో నాలుగు సార్లామెను మోది పంపెను. పూటకూటింటి యామె వలవల యేడ్చుచు నింటికి వచ్చి యరటిపట్టతో కొట్టినటుల చెప్పెను.

నయశీలుడు పూటకూటి యామెకొక వరహా నిచ్చి యూరడించెను. నాల్గవజామున నరటితోటకు రమ్మని యాసంజ్ఞ కర్థమగుట

నరటితోటలోనికి రాత్రి నాల్గవజామున రాజు నంపెను. అట వారిద్దరు కలిసికొని మాటలాడుచుండగా రాజభటులు బంధించి యొకదేవాలయముననుంచి సూర్యోదయమగువఱకు కావలి గాయుచుండిరి. మంత్రియది తెలిసికొని బస కరిగి స్త్రీవేషమును ధరించి యొకపళ్ళెరమున ఫలపుష్పాదుల నుంచుకొని యాలయంబుల కరిగి రాజభటులను వేడుకొని యాలయమును బ్రవేశించి తాను ధరించిన చీర నామె కిచ్చి బయటకు బంపివైచెను. ఆమెయు నింటి కేగెను.

రాజభటులు సూర్యోదయమైన తోడనే రాజును మంత్రిని దేవాలయమున గాంచి వారెవరో దేశాటనము చేయువారని తెలిసికొని భాండారమువారికోడలు స్వగృహముననే యుండుట జూచి యేమియు జేయుటకు దోచక తమ మార్గమున పోయిరి. ప్రభావతీ! చూచితివా? ఆనయశీలుని చాతుర్యతామహిమ! అని చెప్పునప్పటికి సూర్యోదయ మగుటయు తరువాతి కథ రేపు చెప్పెదనని శుకము ముగించెను.

---

# పదునేడవనాటి రాత్రి కథ.

## (భాండారమువారి కోడలు.)

పదునేడవనాటిరాత్రి ప్రభావతి యెట్టిపండునకైన వలపుపుట్టించునంత శృంగారముగ నలంకరించుకొని నందిరాజాంతఃపురమున కరుగనుండ శుకరాజ మామెను కనుంగొని అమ్మా! నిన్నటిరాత్రి యసంపూర్ణముగా ముగించిన కథను విని పొమ్మని యిట్లు చెప్ప మొదలిడెను.

ధనపాలు భాండారమువారికోడలితో గొన్నినాళ్లు భోగముల నందవలెనని యున్నటుల నయశీలునకు దెలుపుడు చేసెను. మంత్రియు రాజు కోరికను నెఱవేర్పదలచి తాను నేటొకగ్రామమున కరిగి యట విరివిగా వ్యాపారమును చేయ నారంభించెను. ధనపాలునిచే స్త్రీవేషమును ధరింపజేసి భాండారమువారి యింటికి దీసికొనిపోయి యాయింటియజమానుని గలిసికొని 'ఆర్యా! మాది ఘూర్జరదేశము. మధురాపురమున వర్తకవ్యాపారమును సాగించు హారనాథశర్మను. నాపేరు మీరు వినియేయుందురు. అనగా నాయజమాని తమ పేరును, ధార్మికమును, వర్తకమునందలి సత్యశీలతయు నేను వింటిని. తమదర్శన మెప్పుడును చేయలేదు. మాయిల్లు పావనమైనది. మీరిట వచ్చిన కారణమేమి? నావలననగు సహాయమేమి? ఈమె యెవ్వరు? అని యడుగుటయు నాకపటవర్తకుడు వినయమును నభినయించుచు బ్రాహ్మణోత్తమా! నేను విరివిగ వ్యాపారము చేయుదలంచితిని. అద్దానికిగాను దూరదేశముల కరిగి యోషధులపై సరకులు తేవలసియున్నది. వచ్చునపుడు కొలదిగా ధనము తెచ్చియుంటిని. నాకు తొందరగా నైదువేల రూప్యములు కావలసివచ్చినవి. ఈమె నాభార్య. ఈమె శరీరమందున్న నగలు పదివేలు చేయును. వానిని కుదువబెట్టుకొని సొమ్మిప్పింపుడు. ఆమె నొంటరిగా నుంచుట నా కిష్టము లేదు నే వచ్చువఱకు నీమెను మీయింట నుండనిండు. ఈమె కగుఖర్చులతో నా కిచ్చు సొమ్మును వడ్డితో యిచ్చి నాభార్యను వస్తువులను జేకొని పోదునని చెప్పెను. భాండారమువారియింటియజమాని యామాటల కంగీకరించి యైదువేలరూప్యముల నొసంగి హారనాథశర్మను పంపివైచెను. అతని భార్యను జాగరూకతతో జూడవలయునని తన కోడలికి వప్పజెప్పెను.

నయశీలుడు డబ్బుతీసికొని యూరువెలుపలకు బోయి చీకటిపడ గానే తన బసకు జేరుకొని యెవరికిని గనుపడకుండ నుండెను. నాటిరాత్రి భాండారమువారి కోడలును హరనాథశర్మ భార్యయు నొకగదిలోనే శయనించిరి. అంత నిశీధసమయమున స్త్రీరూపమునను‌న్న ధనపాలుడు భాండారమువారి కోడలిని మేల్కొల్పి తన స్త్రీరూపమును తొలగించెను. ఆమెయు ధనపాలుని జూచి మిగుల సంతసించెను. ఈరీతిగా ధనపాలుడు పగలంతయు స్త్రీవేషమున నుండి రాత్రికాగానే పురుషరూపమును ధరించి యామెతో కామోపభోగములను దేలుచుండెను. కొన్నిదినముల కాభాండారమువారి కుమారుడు గ్రామాంతరమునుండి యింటికి వచ్చెను. తనయింట స్త్రీరూపమునను‌న్న ధనపాలుని జూచి సౌందర్యాదుల కచ్చెరువంది యెట్లయిన నామెను బొందవలెనను కుతూహలము జనించి యొకనాటి సాయంకాల మొంటరిగ జూచి యామెను వెంబడించెను. ధనపాలుడును నది గ్రహించి సమీపోద్యానంబున కరిగి యందుండి పురుషరూపమున మాయ మయ్యెను. ఆభాండారమువారి కుఱ్ఱడు చాలసేపు తోట నంతటను వెదకి విసికి వేసారెను. ఇంటికేగిన నామె యేమనునదని యడిగి తలిదండ్రులు బాధింతురని గ్రామమును విడచిపోయెను.

ధనపాలుడు తోటనుండి మాయమై మంత్రిని జేరుకొనెను. మరునాటి యుదయమునకు మంత్రి హరనాథరూపమున భాండారమువారి యింటి కరిగి యజమానుని గాంచి, అయ్యా, తమవద్ద చేకొనిన పైకమును వడ్డితో చెల్లించెదను. నాభార్యను నగలను నాస్వాధీనము చేయు డని యడుగుటయు నాయజమాని యతని భార్యయును వెనుకటి సాయంకాలము నుండి కాన్పింప నందున తన కుమారు డామె నెటకో గొంపోయెనని భీతిలుచుండెను. వర్తకుడు ప్రశ్నింపగనే వణకుచు మహా

శయా! ఏమి చెప్పుదును? నాకుమారుడు మిగుల దుర్మార్గుడు. నీభార్య నెటకో చేకొనిపోయినాడు. కావున నందులకుఁ బ్రతిగ నాకోడలిని నీవు చేకొనిపొమ్ము. నాకీయవలసిన ధనమీయనక్కరలేదు. అని కోడలిని బిలిచి యామె నొప్పించి యతనివెంట బంపెను. ధనపాలనయశీలు రామెను చేకొనిపోవుచుండ మార్గమధ్యమున నొకచో నామె భర్త కా న్పించెను. వారామె నతని కిచ్చి తమరాజ్యమునకు బోయిరి.

అని చిలుక తన కథను ముగించునప్పటి కర్ధరాత్రి మగుటయు ప్రభావతి రేపు వచ్చెదనని దూతను పంపివైచి తన గృహంబున కరిగి నాటికి నిద్ర జెందెను.

---

# పదునెనిమిదవ నాటి రాత్రి కథ.

## (మామిడిపండు.)

ప్రభావతి మఱునాటి సాయంసమయమున కపరరతీదేవివలె నలంకరించుకొని రాజాంతఃపురమున కరుగనుండ చిలుక యామెను బిలచి నాచెప్పుకథను విని పొమ్మని యిట్లు చెప్ప మొదలిడెను.

తొల్లి గంగానదియొద్దున గంగసముద్రమను నొకగ్రామంబు కలదు. ఆగ్రామంబున చతుర్వేదంబులను, ఆరుశాస్త్రములను, పదునెనిమిది పురాణములను, సమస్తేతిహాసంబులను బాగుగా నెఱింగిన వాడును, సమస్తసద్గుణాలంకారశోభితుండు నగునొకబ్రాహ్మణుడు కలడు. అతని నామధేయము అనంతశాస్త్రి. అతనిభార్య శ్రీమతీదేవి. కుటుంబముతోబాటు దారిద్ర్యమ్ము విస్తారముగానుంట శ్రీమతి భర్త నెట్లయిన గొంతధనార్జనము చేయవలసిన దని ప్రార్థించెను. అందుల

కనంతశాస్త్రి దేశసంచారము చేయ మొదలిడి యనేకదేశములను దిరిగి యాయాదేశములందలి దార్భిక్షమును గాంచి విసికి వేసారి యింత దూరము శ్రమపడి వచ్చితినిగాన కొన్నితీర్థములందు గ్రుంకిడియైన పోవు మనని తలంచెను. అటనుండి శ్రీశైలమునకరిగి మల్లిఖార్జునుని సేవింప బోయెను. అచ్చట స్వామి నభిషేకాద్యర్చనముల గావించి వచ్చు చుండ నాదేవాలయమునకు చివరభాగమున నొకసమాధిమగ్నుండగు సిద్ధుం డతనికి గానుపించెను.

అనంతశాస్త్రి సిద్ధుని జూచినంత నానందరసమగ్నుడై యతని నాశ్రయించి సేవింప మొదలిడెను. కొలదిదినంబు లిట్లు గడచిన పిదప నాసిద్ధు డనంతుని గాంచి బ్రాహ్మణుడా! నీవు చాలదినములనుండి న న్నాశ్రయించి నాకు సేవల జేయుచుంటివి. హేతు వేమి? అని యడుగ నతడు "స్వామీ! నే నేకోరికయు కోరి మిమ్ములను సేవించుట లేదు. మీయనుగ్రహంబుమాత్రమే కోరితిని." అనుటయు నాసిద్ధుడు బ్రాహ్మణుని సత్యసంధతకు మెచ్చి యతని కెట్లయిన నుపకారము చేయనెంచి సదా స్థిరయౌవనము నిచ్చునదియు, ఆకలిదప్పుల నడంచు నదియు నగునొకచూతఫలము (మామిడిపండు) నిచ్చెను. ఆఫలమును దీసికొని యావిప్రు డింటి కేగెను.

శ్రీమతి భర్త తెచ్చిన యాఫలంబును జూచి ధనము తేనందుకు వగచి దానిప్రభావ మడుగ నతడు సిద్ధునిమాటలే చెప్పెను. అంత నామె మన కిప్పుడు నిత్యయౌవనమే లో టయినది కాబోలును! ఇది ధనధాన్యంబుల నొసంగ నప్పుడు మన కేల? అని రుసరుస లాడెను. ఆవిప్రు డాఫలమును రాజుకడకు గొంపోయి దాని ప్రభావమును జెప్పెను. రా జందులకు సంతసించి యనంతున కొకయగ్రహార మిచ్చి

బహూకరించెను. రాజాఫలమును దాను భక్షింపక తనప్రజ లందఱ కును మేలుచేయ దలంచి దాని నొకచో బాతించెను. అదియు మొలచి చెట్టయ్యెను. ఆరేండ్లకా చెట్టు యొకఫలము మాత్రమే కాచెను. ఆపండు బాగుగా ముగ్గి క్రిందబడెను. దాని నెవరును ముట్టలేదు. దాని నొకవిషోరగము దంతములతో దాకినది. ఆఫలమున విషము ప్రవేశించినది.

రాజాఫలమును బ్రాహ్మణున కీయదలంచి యొకవృద్ధబ్రాహ్మణుని బిలిపించెను. ఆవిప్రునకు భూరిదక్షిణలతో నాఫల మిచ్చెను. అత డచటనే భుజించి వెంటనే మరణించెను. రా జందుల కాగ్రహావశుడై తనవలన నగ్రహారమును బహుమతిగా గొన్నబ్రాహ్మణుని రావించి పలువిధంబుల దూషించి యాచెట్టును వెంటనే నఱుకు మనెను. భటు లావృక్షమును నఱకుట కిష్టము లేనివారై దానికి చుట్టును కంచె వేసిరి. మఱియొక సంవత్సరము గడచెను. ఆచెట్టున వేరొక ఫలము పండెను.

ఆపురమం దున్న నొకబ్రాహ్మణుని భార్య యత్తమామల యొక్కయు, భర్తయొక్కయు బాధ పడలేక యావృక్షముకడ కరిగి దానిక్రింద పడియున్న చూతఫలమును దీసి చావవలె నని భక్షించెను. ఆమె చచ్చుటకు బదులు నిత్యయౌవనవతియై ఆకలిదప్పులు లేనిదై దేవతాసౌందర్యవిలసితయై, అద్భుతప్రభావము కల దయ్యెను.

చిలుక కథ నిట్లు ముగించువఱ కర్ధరాత్రి మగుటయు ప్రభావతి రాజదూత నంపివైచి తాను సుఖనిద్ర జెందెను.

---

# పందొమ్మిదవనాటిరాత్రికథ.

(సమీరుడు.)

ప్రభావతి మఱునాటి సాయంకాలమున బాగుగా నలంకరించుకొని నందిరాజాంతఃపురమున కనంతసంతోషమున నుత్సాహముతో నరుగుచుండ శుకరాజం బామె నాపి ఇక్కథను వినిపొమ్మని యిట్లు చెప్ప నారంభించెను.

పూర్వము నేపాళదేశమును కమలనాభు డనునొకరాజోత్తముండు పాలించువాడు. అతనిభార్య మదనమంజరి. ఆదంపతులకు లేక లేక వసంతకుడను పుత్రరత్న ముదయించెను. అతడు సద్గుణశోభితుడై, వినయవివేకాద్యుత్తమలక్షణలక్షితుడై, మహావిద్యాసంపన్నుడై, ధర్మకార్యాచరణతత్పరుడై, యావనారంభమునకే యన్నివిధంబులచేతను యువరాజపట్టాభిషేకార్హుం డయ్యెను. ఆపట్టణమున విశ్వకర్మకులజుడగు సమీరుడను నొకయువకు డుండెను. అతడును విద్యావంతుడును, యావనవంతుడు నగుట రాకుమారున కతనితో మైత్రి యేర్పడెను. కాని సమీరుడుమాత్రము కుటిలబుద్ధికలవాడును, పరశ్రేయస్సహనము లేనివాడునై యుండెను.

ఇట్లుండ నొకదినమున సమీరుడు కుటిలబుద్ధితో రాకుమారునిం జూచి 'మిత్రమా! నీవు ధర్మకార్యంబులకై విశేషముగా ధనవ్యయము చేయుచున్నావు. ప్రపంచజ్ఞానము, లోకవిజ్ఞానమును బడయుటకుగా గొంతధనమును వెచ్చింపవలయును. అందులకుగాను మనము కొంతకాలము దేశాటనమును జేయవలెను.' అని చెప్పుటయు రాకుమారుడు మిత్రునిమాటను నమ్మి నలుబదివేలవరాలను మూట గట్టుకొని సమీరునితో నొకయర్ధరాత్రమున బయలుదేరెను. వా రిరువు

రును గుఱ్ఱముల నెక్కి యొకసాంద్రారణ్యమున బడిపోవుచుండిరి. అప్పటికి సూర్యుడు నడునెత్తిపైకి వచ్చుటయు నెండవేడిమికి తాళజాలక గుఱ్ఱముల నొకచో నాపిరి. అంత వసంతున కపరితదాహ మయ్యెను. అతడాప్రాంతమందలి యొకబావికడకరిగి నీరు ద్రావుచుండ సమీరుడు వసంతుని వెనుకనుండి నూతిలోనికి త్రోసెను. అంతలో నాగక సమీరుడు గుఱ్ఱపుజీనులో గట్టి భద్రపఱచిన డబ్బును దీసికొని వెడలిపోయెను. వసంతు డాకటికిచీకటిలో నానూతిలో నిటునటు తడుముకొనుచు కష్టపడి పైకివచ్చి యెచ్చటకును అర్ధరాత్రిమున పో నిష్టములేక నొక చెట్టుక్రింద గూర్చుండెను.

అంత నాచెట్టుపై నున్నరెండుపక్షులు మాటలాడుకొనుచుండెను. పక్షిభాషను బాగుగా తెలిసిన వసంతు డామాటలను వినుచుండెను. అందు మగపక్షి యాడుపక్షిని గాంచి 'చెలీ! ఇచ్చట కనతి దూరమున హేమపురంబను పట్టణము కలదు, దానిని వసుపతి యను రాజు పాలించుచుండెను. అతఁడు కాలవశంబున గ్రుడ్డియై ధనంబు లేమిచే దరిద్రత ననుభవించుచున్నాడు. అపురవాసు లందరును నీటికై మిగుల బాధలు జెందుచున్నారు' అని పలికినది. అంత యాడుపక్షి ఈపట్టణమందున్న దేవ్యాలయమున నొకబదనిక చెట్టు కలదు. దాని వేరుయొక్క గంధమును బూసినచో నారాజునకు గన్నులు వచ్చును. ఆదేవ్యాలయమునకు వెనుకభాగమున నుత్తరదిశగా నొకఫర్లాంగుదూరము త్రవ్వినచో మంచిబావి యేర్పడును. ఆబావిలో నెంతటి దేశక్షామము వచ్చినను అనావృష్టిదోషము సంభవించినను జలము సమృద్ధిగ నుండును. అంతియేగాక నాయాలయమున దక్షిణదిశగా నున్న నారికేళ వృక్షమున కొకప్రక్కగా త్రవ్వినచో నపారమైన ధననిధి యొకటి గాన్పించునని పలికినది.

ఆచెట్టుక్రిందనుండి యామాటలు వినుచున్న వసంతుడు తెల్ల వారినపిదప హేమపురంబున కరిగి దేవ్యాలయమును గుర్తించెను. ఆయాలయము నంతను వెదకి బదనికవేరు గ్రహించి వసుమతిమహా రాజుకడ కతని గుప్తితనము సరక్షణములో పోగొట్టెదనని వర్తమాన మంపెను. వసుపతియు వసంతుని రావించి గౌరవించి కన్నులకు చికిత్స చేయు మనియెను. వసంతు డాబదనికవేరు గంధమును బూసినంతనే వసుపతికి గన్నులు వచ్చెను. వసంతు డంతతో నుపేక్షింపక రాజా! నీవు దారిద్ర్యముచే బాధ నొందుచుంటివని వినియుంటిని. నావెంట కొందఱుభటుల నంపితివేని నీ కపారమైన ధనము లభించునని నచ్చజెప్పి భటులను తనతో గొంపోయి యాలయమున ధనమున్నదని పక్షులు పలికినచోట త్రివ్వించెను. అందు కొల్లగా నున్నధనమును వసుపతి మహారాజు ఖజానాకు జేర్చెను. జనులు నీటికై మిగుల చిక్కులు పడుచున్నారని దేవ్యాలయమున నుత్తరదిశగా నొకపెద్దబావి త్రివ్వించెను. దానియందు జలము సమృద్ధముగా నుండెను. వసంతుని యసమానప్రభావమునకు వసుపతియు నాపురమందలి ప్రజలును మిగుల నాశ్చర్యపడిరి. రాజు చాల నానందించి గుణవతియు రూపవతియు విద్యావతియు యౌవనవతియు నగు తనకూతును వసంతున కిచ్చి వివాహ మొనర్చి యల్లుని తనయింటనే యుంచుకొనెను.

సమీరు డావిధమున వసంతుని ద్రోహము చేసి యతనికడ నున్న నలుబదివేలవరాలను సంగ్రహించి యిచ్చవచ్చినటుల కొలదిదిన ములకే ధనము నంతను దుర్వ్యయ మొనర్చి చేత నొకరాగిపైసయైన లేక కట్టెల గొట్టుకొనివచ్చి హేమపురమ్మున నమ్ముచు జీవించుచుం డెను. వసంతు డొకదినమున షికారునకు బోయి వచ్చుచుండెను. మార్గమధ్యమున చింకిరిబట్టలను గట్టి కట్టెలమోపు నెత్తికొని వచ్చు

చున్న సమీరు డతనికి గానుపించెను. రాకుమారు డతనిని జూచినంతనే జాలి నొంది పిలచి యాదరించి 'ఓయి సమీరా! నీవు మిత్రుడవని నమ్మి నందులకు నన్ను మిగుల నన్యాయము చేసితివి. ధర్మమే జయమగునని నేను నమ్మియుంటిని. ఇప్పటికైన నీకు ధర్మప్రభావము బోధపడినదా?' యని ప్రశ్నించెను. సమీరు డేమియు మాటలాడక తలవంచుకొని యూరక యుండెను. వసంతుడు తాను బావినుండి పైకివచ్చినదిమొదలు వివాహమగువఱకు నైన కథను సాంతముగ వినుపించెను. సమీరుడు వసంతునకు ధనము లభించినవిధం బెఱింగి తానుగూడ నొకరాత్రి యాబావికడకు బోయెను. ఆబావియందలిదుండగా పక్షులు చెట్టుపైనుండి వానినిచూచి నాడు మనము చెప్పుకొనిన మాటలు విని దేవాలయమున గూఢముగ నున్న ధనమును చేకొనిపోయినవాడు వీడే యని సమీరుని కన్నులను బొడిచి పొడచి విడచినవి. వా డందు గోలుగోలున నేడ్చుచు పడి యుండెను.

వసంతుడు సమీరుడు కాన్పింపనందులకు వగచి యతనిని వెదకుచుపోయి గాయములపాలై బావిసమీపమున బడియుండ గాంచెను. వెంటనే యతనికి చికిత్స చేయ నంతఃపురమునకు గొంపోయి బదనికవేరుగంధమును బూసెను. తోడనే సమీరునకు గన్నులు వచ్చినవి. కొలదిదినము లిట్లు జరుగ మరల సమీరునకు కుటిలబుద్ధి పొడమి యొకదినమున రాజపుత్రుని గాంచి 'మిత్రమా! నీదుస్తుల నొకదినమున ధరించి నీపడకటింటిలో శయనింపవలెనని యున్నది' అని ప్రార్థించెను.

సమీరుడు రాకుమారుని దుస్తులను ధరించి వసుమతిమహారాజుకడకు బోయి 'రాజోత్తమా! నేను నేపాళదేశాధిపతి పుత్రుడను. అతఁడు విశ్వకర్మకులజుఁడు. నన్ను మోసగించి వచ్చి నేను రాజపుత్రుడనని మిమ్ములను వంచించి మీకుమార్తెను వివాహమాడినాడు. న్యాయ

మాలోచించిన మీకే బోధపడును. అతఁడు బహుదుష్టుడు. అతఁడు చేసిన దుర్మార్గమునుండి యెట్లో తప్పించుకొని వచ్చి యతనిని గుర్తించి యడిగినంతనే నాదుస్తులను నా కొసంగి క్షమింపుమనెను.' అని లేని పోని యబద్ధములను గల్పించి చెప్పెను. వసుమతి సుమతి యగుట నప్పలుకులను నమ్మి మంత్రితో రహస్యగృహమున మంత్రాంగము సల్పి నాటియర్ధరాత్రమున వసంతుని చంపవలసినదని రాజభటుల కాజ్ఞ యిచ్చెను.

భటులు రాజాజ్ఞను శిరసావహించి వసంతుని శయ్యాగృహంబున కరిగి యందు రాజపుత్రుని దుస్తులను ధరించి రాజపుత్రవేషమున శయనించియున్న సమీరుని జంపిరి. మరునాటి ప్రాతఃకాలమున కార్యాంతరమున గ్రామాంతరమున కరిగి వసంతుడు వచ్చెను. సమీరునిమరణ వార్తయు జరిగిన నిజమగుసంగతియు దెలిసికొని యథార్థము రాజునకు నివేదింప నతఁడు తొందరపడినందులకు మిగుల పశ్చాత్తాప మొందెను. ఆనాడే వసంతుఁడు స్వదేశమునకుఁ బోవ పయనముకాగా వసుమతి కూతునకు నల్లునకు విశేషముగా బహుమానముల నిచ్చి నేపాళమున కంపెను. ఇట్లు వచ్చినకుమారుని కోడలిని గాంచి తలిదండ్రులు మిగుల నానందపడిరి.

శుకరాజ మీవిధంబుగా పైకథను వివరించునప్పటికి తెల్లవార వచ్చుటయు ప్రభావతి ప్రయాణమును నిలిపి సుఖముగా నిద్రజెందెను.

---

# ఇరువదవనాటి రాత్రికథ.

(కపటయోగి)

ప్రభావతి మరునాటి సాయంకాలసమయమునకు రెండవరతీదేవి యో యనునటుల నతిశృంగారముగ నలంకరణము గావించుకొని రాజాంతఃపురమునకు నందిరా జంపినదూతి వెంటఁ బోవుచుండెను. శుకము ప్రభావతిని బిలిచి అక్కా! ఈకథను వినినపిమ్మట పోవచ్చునని కథ నిట్లు చెప్ప మొదలిడెను.

తొల్లి చోళదేశమునకు ప్రధానపట్టణమగు నాగపురమును మాంధాత యను రాజు పాలించుచుండెను. అతఁడు గుణమణియను నొక క్షత్రియస్త్రీని పెండ్లియాడెను. ఆమెయం దతనికి సంతాన మెంతకాలమునకు గలుగలేదు. అందువలన నతఁడు నూర్వురుస్త్రీలను వరుసగా బెండ్లియాడెను. అప్పటికిని యొకభార్యకుగూడ సంతానము కలుగ దయ్యెను. అందుల కాతండు నిరంతరము విచారాక్రాంత మనస్కుఁడై యుండి రాచకార్యములం దశ్రద్ధ వహించియుండెను.

ఇట్లుండ నొకదినమున నొకయోగి నాగపురమునకు వచ్చెను. ఆయోగి యొకదేవాలయమున బసచేసెను. పురజను లాబాలగోపాల మతనిని దిలకింప నేగుచు పండ్లతో ఫలములతో నాలయమును నింపుచుండిరి. క్రమముగా నీవార్త కోటలోనికి దెలిసినది. వెంటనే మాంధాత దేవాలయమునకు వచ్చి యోగిని దర్శించి యనేక విధంబులుగ సేవలు జేసి ప్రసన్నుని జేసికొనెను. యోగి నీ కేమి కావలెనని రాజును ప్రశ్నించెను. నాకు నూర్వురుభార్య లుండియు సంతతి లేకపోయెను. నాకు సంతానలాభమున కేదైనవర మనుగ్రహింపుమని వేడెను. ఆయోగి రాజు నుద్దేశించి రాజశ్రేష్ఠా! నీకోరిక కొలదికాలములో సిద్ధించును.

నే నిచ్చునూరుమామిడిపండ్లను నీనూర్వురుభార్యలకు నిమ్ము. కాని యిందులకు నీవలన నే నొక ప్రత్యుపకారమును గోరదలంచితిని. నీకు నూర్వురు పుత్రు లుదయింతురు. అందు నేను గోరినవాని నొకనిని నాశుశ్రూషకై యియ్యవలయును. అని పలికెను. రా జందుల కంగీక రించెను. యోగి నూరుమామిడిపండ్లు నొసంగెను. వానిని రాజు భార్యల కిచ్చెను. వారును మిగుల సంతోషమున భుజించి యచిరకాలములో గర్భములను ధరించిరి. తొమ్మిదమాసములు గడచినపిదప నూర్వురకును నూర్గురు సౌందర్యవంతులగు పుత్రులు కలిగిరి. వారికి పదునారు వత్స రముల ప్రాయమువచ్చి యౌవను లైరి.

ఇట్లుండ యోగి మాంధాతను దర్శించి 'రాజా! నా కానాడు వాగ్దాన మొనర్చినటుల నీకుమారులలో నేకోరినవానిని నాకొసంగుము' అనెను. రాజు లోపల విచారము కలిగియు నేమియు ననలేక యొక కుమారు నిచ్చెను. యోగి యారాజపుత్రుని పురబాహ్యప్రదేశమునకు గొంపోయి ఓబాలకా! నాయాశ్రమంబునకు మనము పోగలుగుటకు రెండుమార్గము లున్నవి. అం దొకటి కఠినశిలాతలాచ్ఛాదితము, కంటక సమన్వితము. రెండవది మిగుల నిష్కంటకము, సుగమమునై యుండు ను. మన మేమార్గమున బోవుదమని యడిగెను. ఆయువకుండు 'మన మేల కష్టతరమార్గమున బోవలయును. సుఖతరంబగు పథంబుననే పోవు దము' అనెను. యోగి వాడు తన కక్కఱకు రా డని శంకించి తిరిగి రాజుకడ కరిగి మఱొకపుత్రు నీయుమని కోరెను. అత డట్లే పంపెను. వాడుకూడ నట్లే యనెను. ఈవిధమున తొంబదితొమ్మండ్రుకూడ నట్ల యిరి. నూఱవవాడుమాత్రి మట్లనక స్వామీ! తమ రేమార్గమున బోవుదమన్న నామార్గముననే పోవుదము. అనుటయు యోగి తద్యువ కుని ధైర్యమునకు సంతసించి తనయాశ్రమమునకు గొంపోయెను.

యోగి యీరాజపుత్రునితో ప్రతిదినము నాకు పూజార్థము పత్రఫలపుష్పములను సమిత్కుశాదులను నీవు తెచ్చుచుండవలయునని యాన వెట్టెను. అం దొకనియమము నేర్పరచెను. ఉత్తరదిశకుమాత్రము నీవు పోవల దనెను. కాయితివా ప్రమాదమున బడగల వనియెను. ఇట్లు దినంబులు గడచుచుండ నారాజపుత్రు డొకదినమున యోగి యుత్తరదిశ కేల పోవద్దనెను? అం దేవియో విచిత్రంబులు, విశేషంబులు నుండితీరును. నే దాదిక్కునకు బోయి యాయావింతల నరసెదగాక యని యుత్తరదిశకు బయనమై కొంతదూర మరిగెను. అట నతని కొక దేవాలయము గానుపించెను. అది కాళికాలయము. దానిప్రక్క నొక పెద్దరావిచె ట్టున్నది. దానిశాఖలపై మనుష్యులపుఱ్ఱెలు వ్రేలాడుచుండెను. ఆపుఱ్ఱె లాతనిం గాంచి పక్కున నవ్వినవి. రాజపుత్రు డతిధైర్యముతో వానిని సమీపించి 'మీరేల నన్ను జూచి నవ్వితిరి?' అని ప్రశ్నింప నవి 'రాకుమారా! మేమును నీవలెనే యీకపటయోగి మాటలనువిశ్వసించి యిట్లు కష్టదశ నంది యిం దున్నారము. మావంటి నిర్భాగ్యు లింకను గలరా' యని నవ్వు వచ్చినది. అమావాస్యనాడు నిన్ను యోగి కాళికాలయమునకు గొనివచ్చి దేవికి నమస్కరింపు మనును. నీ వట్లు చేయుచుండ వెనుకబాటున నిన్ను కఱకుకత్తిచే నఱకును. నీ క్షేమము గోరి చెప్పితిమి. నీ వేదైన నుపాయమును జూచుకొని యితని బారినుండి తప్పించుకొను మని చెప్పినవి. రాజపుత్రుండు వల్లెయని యచటనుండి పడమరదిశగా పోయి ఫలపుష్పాదులను సేకరించుకొని యోగి సన్నిధి కేగెను.

ఇట్లు నాలుగుదినంబులు గడచెను. నా డమావాస్య. యోగి సూర్యోదయము కాకముందే రాజపుత్రుని మేల్కొల్పి, వత్సా! నేడు నాతో నీ వుత్తరదిక్కునకు రమ్ము. అందలివిశేషంబులను జూచెదవు.

ముందు స్నానమును జేసి పట్టువస్త్రములను గట్టి నుదుట కుంకుమ బొట్టు పెట్టికొని ర మ్మని బయలుదేరి క్రమముగా కాళికాలయమునకు జేకొనిపోయెను. అప్పటికి తా నిదివరలో దేవ్యాలయసమీపమున నశ్వత్థవృక్షమున జూచిన పు ... లందు కాన్పింపలేదు. దాని కారాజపుత్రు డాశ్చర్య మందెను. యోగి రాజపుత్రుని కాళికాలయమునకు గొంపోయి ముందు తాను దేవిని పూజించి పిమ్మట నా యువకుని దేవికి నమస్కరింపుము. నీకోరికలు సిద్ధించు ననెను.

అపుడు రాజకుమారుఁడు మహాత్మా! నేను క్షత్రియవంశమున బుట్టినవాడ నగుట నింతదనుక నితరులకు న్మ్రొక్కు నమస్కరింపవలెనో యెఱుంగను. ఆవిధానమును నాకు తెలియనేర్పుడు. అని పలికినంతనే యోగి సాష్టాంగపడెను. వెంటనే యువకుడు కత్తి నొఱనుండి తీసి యోగిని వధించెను. అంత కాళికాదేవి మిగుల సంతసించి యతనికి సాక్షాత్కరించి, బిడ్డా! నీధైర్యమునకు మెచ్చితిని. ఎందఱనో మోసగించి తెచ్చి బాధించు నీదుష్టుని వధించితివి. నా కానందము. నీ కేమికావల యునో కోరుకొనుము? అని పలుకుటయు నా రాజపుత్రుండు తల్లీ! నాకు నీదయయే చాలును. ఈదుష్టునివలన వధింపబడిన రాజపుత్రుల నందఱను బ్రతికింపుము. పుత్రవియోగమున బొగులు వారితలిదండ్రులు సంతసింతు రనెను. అంత నామె యాపుత్రుల నొకచో జేర్పించి మంత్రాక్షతలను జల్లినది. వా రందరును సజీవు లైరి.

పిమ్మట కాళికాదేవి యారాజపుత్రునకు మిగుల మహిమగల కొన్నిమంత్రముల నుపదేశించి యొకగంధర్వస్త్రీ నొసంగెను. ఆగంధర్వ కాంత నచటనే నిలిపి రాజపుత్రు డాయరణ్యమును జూడ బయలుదేరెను. తోడనే యొకబ్రహ్మరక్షస్సాతనికి గోచరించెను. అత డారక్క

సిని చంపబోయెను. ఆరాక్షసి నన్ను చంపవలదనియు నీకు విధేయురా లనై వర్తింతుననియు బలికెను. నేను తలంచిన వెంటనే వచ్చి నాకోరి కలను దీర్చుచుండవలె నని యాజ్ఞాపించి మఱల ముందునకు ప్రయా ణము సాగించెను. అంత నక్కడ మృతుడైన నొకవృద్ధునికళేబర మత నికి గానుపించెను. ఆకళేబరము నొలిచి దానిని రాజపుత్రుడు ధరించి యటకు దగ్గఱగానున్న నొకగొప్పపట్టణమునకుఁ బోయెను. అప్పటి కా నగరాధిపతికుమార్తె యగుమదనమంజరికి స్వయంవరమహోత్సవము జరుగుచుండెను. ఇతడుగూడ నామహోత్సవమున కరుదెంచి రాజపు త్రులలో గూర్చుండెను. జగదేకసుందరియగు నారాకుమరిత చేత నొక పూల దండను బట్టుకొని స్వయంవరమండపమున కరుదెంచెను. క్రమ ముగా చెలికత్తెవలన రాజపుత్రుల నందఱచరిత్రలను వినుచు సౌందర్యా దులగనుచు కొందఱను దాటి వృద్ధునికళేబరమున గప్పువడియున్న రాజ పుత్రునికడకు వచ్చెను. ఆమె తనసమీపమునకు వచ్చునరి కతఁడు కాళి యుపదేశించిన మంత్రమును జపించి రెండవమన్మథునివలె నామెకు గానుపించెను. ఆమెయు వెంటనే మిగుల సౌందర్యవంతుఁడుగ గనించు నతనిమెడలో పూలదండ వైచెను.

అపు డచ టిబంధువులు ముసలివాని నేల వరించితి వనిరి. వివా హాదికములు పలక్షణముగా జరిగినవి. ఆదంపతుల నొకగదిలో బ్రవేశ పెట్టిరి. అర్ధరాత్రమున నాకొమరుడు తనకళేబరమును తొలగించి పండు కొనెను. రాజపుత్రిక కపుడే మెలకువ వచ్చెను. ఆమె తనభర్త సౌంద ర్యమున కాశ్చర్యపడి తలిదండ్రులకు చూప దలంచి యంతఃపురమునకు వారిని చేకొనివచ్చునరి కతఁడు మరల కవచమును ధరించియుంట వృద్ధు నివలె కాన్పించెను. ఆమె మరింత విస్మయ మందెను. మరుసటిదిన మాముదనమంజరితండ్రి వేట కరుగ నుండెను. అల్లుడు నేనుకూడ వత్తు

ననెను. రా జందులకు నవ్వి 'నీవు రావలదు, అయాసకరంబగు పనులను జేయక గృహంబున నుండు' మనెను రాజపుత్రుడు వినక వెంటనేగెను. అరణ్యమును ప్రవేశింపగనే మామ యొక్క వైపునకు అల్లు డొక ప్రక్కకు బోయిరి. అల్లుడు వెంటనే బ్రహ్మరాక్షసిని దలంచుకొని నేడు వేటలో నీయరణ్యమందలి మృగములలో నొకదానినిగూడ నామామకు చిక్క నీయక నాకే దొరకునట్లు చేయు మనెను. బ్రహ్మరాక్షసి యట్లొనర్చెను. వేట ముగిసినపిమ్మట నల్లుడు 'తాము వేటాడినజంతువులను జూపుడు' అని మామ నడిగెను. తాను వేటాడినజంతువులను మామకు జూపెను. అత డాశ్చర్యపడి యల్లుని శ్లాఘించి యిరువురు పురంబున కేగిరి.

మరియొకనాటి నిశీథమున రాజపుత్రుడు కవచమును దీసి వైచి నిద్రించుచుండ మదనమంజరి గాంచి యాకళేబరమును దాచి తలిదం డ్రులను చేకొనివచ్చి చూపెను. వా రల్లుని సౌందర్యమును గని యబ్బుర మందిరి. ఉదయమున నిద్రనుండి మేల్కాంచి కవచము గాన్పింపమికి రాకుమరుడు భార్య నడిగి మామకోరికప్రకారము సభ కరిగెను. అచటివా రందరును సంతసించిరి. రాజపుత్రు డచట కొన్ని దినంబు లుండి మదనమంజరితో మామ యొసంగుకాన్కలతో బయలు దేరి కాళికాలయమందున్న గంధర్వకామినిం గొని నాగపురమునకు బోయి తలిదండ్రుల కామోదమును గలిగించెను.

ఇట్లు చిలుక చెప్పునప్పటికి సూర్యోదయ మగుటయు ప్రభావతి 'నాటికి పయనంబు నాపి రేపకడ వత్తు'నని నందిరాజునకు వార్త నంపి గృహాంతరమున కేగెను.

---

# ఇరువదియొకటవనాటిరాత్రికథ.

## (ముగ్గురుభార్యలు.)

ప్రభావతి మరల సాయంకాలమగువరకు మిగుల విలాసముగ నలంకరించుకొని యుపపతినిగూడ నుత్సుకతతో వెడలుచుండ శుకరాజ మావిలాసవతిని గాంచి యిప్పటి కిరువదికథలను జెప్పితిని. నీ మనసు తిరుగ దయ్యె. నేడు నేజెప్పుకథను సాంతముగ విని పొమ్మని యిట్లు చెప్ప నారంభించెను.

తొల్లి వంగదేశమును రమణకుడను నొకరాజు పాలించుచుండెను. అతనికడ విజ్ఞానసాగరుడను మంత్రి కలడు. ఆ రాజమంత్రు లిద్దరకును చిరకాలము సంతతి లేకపోయెను. వా రంత శివునిగూర్చి తపంబొనర్చుట కొక గుహాలోనికి బోయిరి. అట నొకసిద్ధుఁడు వారి కగపడెను. వీరిరువురు నా సిద్ధునకు నమస్కరించిరి. మీ కేమి కావలయునని సన్న్యాసి ప్రశ్నించెను. మాకు సంతతి కావలయునని వారు కోరిరి. సిద్ధుఁడు వారిరువురకు చెరియొక చూతఫలంబు నిచ్చెను. వా రాపండ్లను భార్యల కిచ్చిరి. వారు కొలదికాలమునకు గర్భవతులై రాజభార్య ఆడశిశువును మంత్రిభార్య మగశిశువును గనిరి. వా రిరువురు నేకకాలమున జనించినవా రగుట నొకచోటనే విద్యాభ్యాసమును జేయించిరి. వారును సమస్తవిద్యలతోబాటు ననురాగమును వృద్ధి నొందించుకొని యౌవనవంతులైరి. మంత్రికుమారు డేయేశాస్త్రముల నభ్యసించెనో రాజపుత్రికయు నా యావిద్యలం దారితేరెను. వా రిరువురును పరస్పరమనురాగవశులై యొకరి నొకరు వివాహము చేసికొనుట కువ్విళ్లూరుచుండిరి.

రమణకుడు తనకు బుత్రిక కలిగినందునకు విచారపడెను.

మంత్రి యట్లు విచారపడురాజునుగాంచి 'ఆర్యా! తా మెందులకు విచారింతురు. నేనుమాత్రి మితరుఁడనా? నా కుమారునకే మీ కూతు నిచ్చి మీయల్లునకే రాజ్యమిండు' అని పలికి యూరడించెను. రా జపు డు కూతును గాంచి నీవు వివాహోచితవయస్క వైతివి. ఇంక నంతః పురమునుండి బయటకు రాకూడ దని శాసించెను. రాజపుత్రికయు నొక్కమారుగా మంత్రికుమారుని స్నేహలతను ద్రెంపవలసివచ్చినది గదాయని విషాదము నొందుచు నొకదినము మంత్రికుమారుని తన సౌధంబునకు రావించి 'మిత్రమా! నీయెడబాటును నే సహింపజాలను. మన కింకను వివాహ మెప్పుడు జరుగునో తెలియదు. నీవు రేపటియర్ధ రాత్రిమున పురోద్యానమునకు సమీపముననున్న కోనేటియొద్దన నాకై వేచియుండుము వలసినంత ధనమును గొనివత్తును. అశ్వము నధిరో హించి రమ్ము' అని హెచ్చరించి పంపెను. మంత్రిసూనున కది యిష్టము లేకపోయినను యాపెను వదలజాల కందుల కంగీకరించెను.

ఆరాజపుత్రి నిశీధసమయమున నొంటరిగా నేరికి దెలియకుండ నమూల్యంబులగు రత్నాభరణంబులతో విశేషమైన ధనముతో నమిత వేగంబుకల యొకగుఱ్ఱము నెక్కి గమ్యస్థానమున కేగెను. మంత్రికుమా రు డట నామెకై వేచియుండెను. వా రిరువురు నారాత్రి యంతయు ప్రయాణమును సలిపి మరునాటి యుదయమున కొకరమణీయోద్యాన మును జేరిరి. ఆయుద్యానమున నొకమేడ యుండెను. వా రట నున్న సరోవరమున స్నానమును జేసి ఫలములను భక్షించి కొంతవడి విశ్ర మించిరి. ఆతరుణమున రాజపుత్రిక తనకంఠమందున్న నమూల్యరత్న హారమును మంత్రికుమారున కిచ్చెను. అత డాహారమును మేడయందు విశ్రమించినపు డొకకొయ్యకు దగిలించెను. పిమ్మట వా రిరువును

హారమును మఱచి ఘోటకముల నెక్కి ప్రయాణమును సాగించి సాయంకాలమున కొకపట్టణమును జేరుకొనిరి.

ఆపురమున విలాసవతి యనునొక వారకాంత మృతి నొందినది. దానితల్లి పుత్రికావియోగదుఃఖమున బొగులుచుండెను. ఆయింటిముందునుండియే రాజపుత్రికయు మంత్రికుమారుడును పోవుచుండిరి. ఆవేశ్యమాత రాజపుత్రికను గాంచి యామెను జచ్చిన తనపుత్రికను జూచినట్లే యున్నదనియు కొలదిదినములు నాయింటనుండి పొమ్మనియు వేడుకొనినది. వా రామెపలుకులను పెడచెవిని పెట్టజాలక సంమల కంగీకరించిరి. మరునాటి సూర్యోదయమున హఠాత్తుగా మంత్రిసూనునకు హారము మఱచుట జ్ఞప్తికి వచ్చినది. వెంటనే యతడు పయనమై రాజపుత్రిక వల దనుచున్నను వెనుకటిమార్గమున నాయుద్యానవనమును జేరి హారమును ఖడ్గముతో నందికొని కంఠమున ధరించెను. ఆహారమందున్న సర్ప మామంత్రికుమారుని కఱచెను. తోడనే యతడు మూర్ఛజెందెను. అశ్వము తనయజమాని స్మృతివిహీనుడగుట నెఱింగి తొందరగ రాజపుత్రికయున్న నగరమున రాజవీధిని బడిపోవుచుండెను.

అశ్వముపై జచ్చిపడియున్న మంత్రిపుత్రుని వే రొకవారకాంత గమనించి యతనిసౌందర్యమునకు మోహపడి యశ్వము నాపి యతనిని లోనికి గొంపోయి విషవైద్యులచే చికిత్సల జేయించెను. మంత్రికుమారుడు మరల జీవించి తనకు సేవలు చేయువేశ్యను దిలకించి దాని యందచందంబులకు కట్టుపడి యందే యుండెను. ఆహారము నామెయే ధరించెను. వా రిరువురును ప్రణయవాహినిలోబడి యూగులాడుచుండిరి. అట రాజపుత్రి తనప్రియు డెంతకు రానందులకు వగచి తన విచారము నావేశ్యమాత కెఱింగించెను. ఆమెయు నొకజ్యోతిష్కుని

కడ కరిగి పశ్నించెను. ఆపండితుడు మంత్రిసూనుడు జాగరూకుడై యున్నాడనియు నొకమండలము దినములలో తిరిగి రాగలడనియు జెప్పెను. వేశ్యమాత తన్నగరసమీపమందలి గ్రామాదులను వెదకించి మంత్రికుమారుని జాడ లరయుచు రాజపుత్రి నూరడిల్ల జేయుచుండెను.

హేమాంగి యనువేశ్యయొక్క తల్లి తనకూతురు మంత్రిపుత్రునివలలో పడి ధనార్జనము చేయకుండుటకు వగచి సామదానములచే కూతు నొప్పింపలేక కాళికాలయంబున కరిగి యాదేవి నుద్దేశించి, 'తల్లీ! నాకూతు నామంత్రికుమారునుండి విడదీయుదువా? లేక నాశిరమును నీపాదములకడ బలిగా గొనుమందువా?' యని యడిగెను. దేవి యామె యవివేకతకు వగచి యామె కొకతురాయి నిచ్చెను. ఈతురాయి నెత్తిపై నుంచిన నేప్రాణియైనను చిలుకగా మారును. అని చెప్పగా వేశ్యమాత మిగుల సంతసించి యింటికిబోయి సమయము గనిపెట్టి యుండెను. ఒకదినమున వేశ్యమాత మంత్రిసూనున కభ్యంగనస్నానమును జేయింతునని నెపము పెట్టి తురాయి యాతనిశిరముపై నుంచెను.

తక్షణము యామంత్రిసూనుడు చిలుకగా మారి యానగరరాజాంతఃపురసౌధముపై వ్రాలెను. రాజపుత్రిక చిలుకను జూచి ముద్దాడనెంచి పట్టుకొనబోవ లభింపక వారిని విసిగించి తుదకు రాజపుత్రికచేతిపై వ్రాలెను. ఆమెయు నాచిలుకను తనపడకటింటిలో పంజరమున బంధించెను. హేమాంగి యట తనప్రియు నెడబాటునకు వగచుచుండెను.

ఒకనాడు రాజపుత్రిక శయ్యాగారమున హంసతూలికాతల్పమున బరుండి చిలుకను పంజరమునుండి తీసి ముద్దాడుచుండ తురాయి క్రిందబడెను. అంత నాచిలుకరూపమును విడచి మంత్రిసూనుడు నిజరూపమందెను. దాని కారాజపుత్రి యచ్చెరువంది వానిసౌందర్యవిలాసము

లకు జిక్కి మక్కువ నక్కన జేర్చి కామకేళిడల దేలెను. అట్లే మంత్రి సూనుడు పగలు తురాయిని ధరించి చిలుకగనుండి రాత్రివేళ నిజ రూప మందుచు నామెతో స్వేచ్ఛావిహారమును జరుపుచుండెను. ఇట్లుండ రాజపుత్రిక గర్భమును దాల్చెను. ఆసంగతిని చాకలివాడు గ్రహించి రాణితో జెప్పెను. ఆమె రాజున కెరిగించెను. అంత నాతఁ డుగ్రుడై పోతుటీగ చొరరాని యంతఃపురమున నీట్టియకార్యము జరి గినదనియు కుమార్తె నడవడి నేమరక గనిపెట్టుచుండుమనియు చెలిక త్తెలకును భటులకును గట్టడిచేసెను.

ఈవిధమున భటులు కనిపెట్టియుండ నొకనాటిరాత్రి కిటికీ సందులనుండి రాజభటు డొకడు రాజపుత్రి మగవానితో రమించుట జూచెను. అతడు చూచుట రాజపుత్రి యెఱింగి భీతిల్లి కర్తవ్య మేమని ప్రియునితో ననెను. అంత మంత్రిసూనుడు 'చెలీ! భీతి నొందకుము. నే నెట్లో తప్పించుకొని నీతండ్రిని మెప్పించి నిన్ను వివాహ మాడు దును' అని చెప్పి యూరడించి చిలుకరూపమును ధరించి పారిపోయెను. భటుడు వెంటనే డేగయై వెన్నంటెను. చాలదూర మిద్దరువురును పోయి నపిదప మంత్రిపుత్రుని తలయందలి తురాయి యూడిపోయి నిజరూప మందెను. రాజభటుడు డేగరూపమును విడచి వానిని వెంట దరిమెను.

మంత్రిసూను డొకసెట్టియింటిలో దూరెను. ఆసెట్టికోడలు తనయింట వంటయింటికిందనే లెన యుండగానిం ఖుచి మోహించి యానంద మంది గౌరవించెను. అతఁడు తనరాక నెరికిని దెలియనీయ వల దనెను. ఆమె భర్త వికలాంగుడై వీధిలో ద్వారముకడ నుండెను. రాజభటు డటకు వచ్చి 'నీయింట నొకపురుషుడు చొరబడెనా' యని ప్రశ్నించెను. ఆమె తనభర్త నితడే యని చూపెను. నేను కాదు బాబో

యని వికలాంగుడగు నామెభర్త యఱచెను. నన్ను మరల మోసగింప నీరూపొందితివా యని భటుడు వానిని మోదుచు చేకొనిపోయెను. స్త్రీకోడలు తనభర్తను సుందరునిగా జేయవలయునని కాళికను బూజించితిననియు నామె దయార్ద్రహృదయయై నాకు బ్రసాదించెననియు జెప్పి తనయత్తమామలకు మంత్రిసూనుని జూపెను. వారది విశ్వసించిరి. స్త్రీకొడుకును రాజుకడకు గొంపోవ నాయింట నెవడో సుందరుడుండె నని యాతడు మొఱవెట్టెను.

రాజాయింటిసెట్టిని రావించి 'కొడుకునకు రత్నపరీక్షలో మంచిపరివేళ మున్నదట అందగాడట. వానిని రాత్రి నాయింటికి చేకొనిర మ్మని యాజ్ఞ చేసెను. రాజాజ్ఞ మీఱని దగుట సెట్టి మంత్రిసూను నటకు గొంపోయెను. రాజు వాని నంతఃపురమునకు గొనిపోయి సత్కరించెను. ఆయువకు డందుల కాశ్చర్యపడెను.

అత్తఱుణమున రాజపుత్రిక యటకు వచ్చి తనవలపుకాడతడే యని చెప్ప రాజు సంతసించి తనకూతు నతనికి శుభముహూర్తమున వివాహము గావించి స్త్రీకుమారు నింటికి బంపివైచెను. మరునాడావధూవరు లూరేగుచుండ మదనము జరియున్న సౌధముకడ కరుగువఱకు మంత్రికుమారుడు రథము నట నాపి రాజపుత్రికను రావించెను. ఆమెయు తనప్రియుని జూచి యానందబాష్పములను విడచెను. మంత్రికుమారు డామెనుగూడ రథముపై నెక్కించుకొని హేమాంగియింటి కేగి యామెనుగూడ రథమున నిడుకొని కొలదిదినంబులు రాజాంతఃపురమున నుండి రాజువలన కానుక లంది ముగ్గురుభార్యలతోను స్వదేశమున కరిగెను. అతనితలిదండ్రులును రాజును వారిరాకకు మిగుల నలరిరి. రాజు పురుషసంతానము లేనివాడగుట తనకూతును మంత్రిపుత్రునకు మహావైభవమున పెండ్లి గావించి నాడే రాజ్యాభిషేకమును జేసెను.

శుకరాజ మీకథను ముగించువఱ కర్ధరాత్రము దాటుటయు నాప్రభావతి నాటికి ప్రయాణమును నిలిపి నిద్రించెను.

---

# ఇరువదిరెండవనాటిరాత్రి కథ.

## (మధుసూదనుడు.)

మఱునాటి సాయంకాలమున ప్రభావతి యథాప్రకారముగ నతివిలాసముగ శృంగారించుకొని నందిరా జంపినదూతివెంటఁ బోవుటకు పయన మగుట చిలుక చూచి యామెను జేరబిలచి నీవు చేయదలచిన పని నెప్పుడైన చేయగలవు. నాచెప్పబోవు కథను సాంతముగ విని పొమ్మని యిట్లు చెప్పుటకు మొదలుపెట్టెను.

పూర్వము మగధదేశమునందలి మాగధపురంబును మాధవసేనుడను రాజు పాలించువాడు. అతనియర్ధాంగి మధురవతీదేవి. ఆదంపతులకు మధుసూదనుడను నొకపుత్రు డుండెను. ఆతడు బాల్యమునుండియు శాంతాదిసద్గుణంబులు కలవాడై క్రమంబుగ ఆన్వీక్షకి, దండనీతి, రాజనీతి, సాము, గరిడీ, అశ్వారోహణ, గజారోహణాదివిద్యలం దారితేరి పదునెనిమిదేండ్లప్రాయమువా డయ్యెను. యౌవనము పొడసూపు చుండెను. రా జతనికి వివాహము చేయ దలపెట్టెను. దేశదేశములనుండి రాజపుత్రికల చిత్రరూపపటములను దెప్పించెను. మధుసూదనున కాపటములలో నేదియు నచ్చలేదు. రాజు మిగుల కష్టపడి యింకను రాజపుత్రికలపటములకై నెమకించుచుండెను.

ఆర్యావర్తమునందుగల స్వతంత్రరాజ్యములలో పేరొందిన కొలాటదేశమును కుమారసేనుడను రాజు పాలించుచుండెను. అతనికి ప్రేమ

లత యనునొకకుమార్తె కలదు. ఆమె లేకలేక గలిగిన సంతాన మగుట కుమారసేను డామెకు కావ్యనాటకాలంకారాది సమస్త విద్యలును, గృహవిద్యానిర్వహణమునకు బనికివచ్చు వృత్తివిద్యలను నేర్పించెను. ఆమె మిగుల విజ్ఞానియై యావనవతియై మాతృభాషలోనేగాక మఱి కొన్నిభాషలలో కవిత్వము చెప్ప మొదలిడెను. ఆమె సౌందర్యమునకు విద్య మఱింత వన్నె దెచ్చినది. అందువ నామె సుగుణపుంజమని దేశ దేశములందు ప్రఖ్యాతి నందినది. ఆమెను వివాహమాడ ననేకరాజ పుత్రులు వచ్చి తిరిగిపోవుచుండిరి. ప్రేమలత యెట్లో మధుసూదనుని ఖ్యాతి విని యతని చిత్రప్రతిమను దెప్పింపుమని తండ్రిని కోరినది. అతడును కుమార్తెకోరిక నెరవేర్ప దలంచి యామె చిత్రపటమును మాధవసేనున కంపి మధుసూదనుని చిత్రపటమును బంపుమని భటుల నంపెను. అవియును త్వరితకాలమున వచ్చి చేరినవి. వారిరువురును ప్రతిమల జూచికొని యిష్టపడిరి.

ఒక శుభముహూర్తమున కుమారసేనుడు మాధవసేనుని సకు టుంబ సామంత మంత్రి పురోహిత బంధు మిత్ర పరివారసమేతముగ తనపురమునకు రప్పించి మహా వైభవముగ ప్రేమలతామధుసూదనులకు వివాహము గావించెను. వివాహమైనపిదప వధూవరులు కొంతకాల మచటనే యుండిరి. తక్కినవా రేగిరి. మధుసూదనుడు భార్యతో కూడ నత్తమామలకడ సెల వంది మాగధపురంబునకు బయలు వెడ లెను. వారికి త్రోవలో నొకసాంద్రారణ్యము తగిలినది. అందు గుడా రముల వైచికొని నాటికి విశ్రమించిరి.

ఆయరణ్యమున నొకగొప్పవటవృక్షము కలదు. అందే వారు గుడారములను వేసికొనిరి. ఆవటవృక్షశాఖపై నొకగుడ్లగూబ యుండె

విచిత్రముగా పెద్దయుఱ పఱచినది. ఆయుఱపునకు మధుసూదను డెగిరిపోయెను. ప్రేమలత భర్తనుగానక వాపోవుచుండెను. పరివార మామె నూరడించి యతనిని వెనుక గొంతముందిపోయి యెందును గానక తిరిగి వచ్చి ప్రేమలతను గాంచి అమ్మా! చింతిలకుడు. మాగధపురమునకు జేరుదము. మీమామగారు పుత్రుని వెదకించి తెప్పింతురు. విచారము వలన ప్రయోజన మేమి? అని మగధపురమున కామెను గొంపోయిరి. అత్తమామ లామె నాదరించి పుత్రునికై వాపోయిరి. మాధవసేనుడు పుత్రు నన్వేషింప నన్నిదిక్కులకు తగినవారి నంపెను.

మధుసూదను డాపులుగు వెంబడి నెరిగిపోయి యొకసరస్తీరమున నాగెను. ఆసరస్సునం దేవ్వరు దేవకామినులు స్నానము చేయుటకు వచ్చి తీరమందున్న మధుసూదనుని గాంచి యతనిసౌందర్యవిశేషమున కచ్చెరువుపడి యతనితో రతిక్రీడల దేలని కామినీజీవితము వ్యర్థమని యతనిని దేవలోకమునకు గొంపోయిరి. అంత నతఁడు నిద్రనుండి లేచెను. నలుదిక్కుల పరికించెను. ఆశ్చర్యసంభ్రమము లతని నావరించెను. ఎట్టయెదుట నపూర్వలావణ్యవతులగు దేవతారమణు లత్యంత మనోజ్ఞముగ నాట్యమును సలుపుచుండిరి. అపుడ యొకదేవకామిని పంచభక్ష్యపరమాన్నసహితమై షడ్రసోపేతమైన విందును బంగారు పళ్ళెరమున నమర్చి యెదుటబెట్టెను. అతఁడు కడుపార భుజించెను. ఆమె యొక్కతయె యుండి తక్కవా రదృశ్య లయిరి. ఆమె మధుసూదనున కమృతతుల్యమగు తమలము నిడి యధరోష్ఠము నాతని కందించెను. అంతతో నాగక నామె నాతో భోగపరుండవై రమింపుమని వేడికొనెను. అతఁడును దానివిలాసములకు జిక్కి కామక్రీడ నామెను దృప్తి నందించెను. వేరొకతె వచ్చి యట్లే వేడెను. ఇట్లయిదుగురు వేడుటయు నైదుగుర నాతఁడు తృప్తి పఱచెను.

ఇట్లు కొన్నిదినంబులు జరుగ నొకనాఁడం దొకలలనామణి మధుసూదనుని జేరి, 'ప్రియుడా! మనుష్యులు గానమందుగాని, సౌందర్యమందుగాని, ఉపచారమునందుగాని దేవతలతో సాటి నొందుదురా?' యని ప్రశ్నించెను. వెంటనే యతనికి తనభార్యను భయంకరారణ్యమున విడచి వచ్చినసంగతి జ్ఞప్తికి వచ్చెను. తోడనే నిరంతరము చిఱునవ్వు చిందులాడు నతని మోమున విచారకరంబులగు చిన్నె లగుపడినవి. దేవతాస్త్రీ లాచిన్నెలను గమనించి యతనిని చేరంజని నాథా! ఇట్లు మీమొగము విన్నబోయి యున్నదే మని పరిపరివిధముల నడుగుటయు నాతఁడు మఱింత విచారగ్రస్తుఁడై తనభార్య నరణ్యమున విడచితిననియు నామెను గాంచినగాని నామనం బూరట జెందదనియు బలికెను.

అంత ఖేచరాంగనలు దివ్యదృష్టిని బగికించి యామె క్షేమముగ మగధపురము చేరినదని గ్రహించి 'ప్రాణప్రియా! నీసతి భద్రముగ స్వగృహంబున నున్నది. నీ కామెను జూడ దలంపుగలదేని రాబోవు శుక్రవారమునాటిరేయి యట కరిగి మరల సూర్యోదయము కాకుండ నిటకు రావలయును. అందులకు దగినసన్నాహమును మే మొనరింతుము. నిన్నొకక్షణమైన విడచి యుండజాలము. అంతియేగాక మీమాకలయికగాని మాసమాచారముగాని నీ వెవ్వరికిని దెలుపగూడదు. అటు తెలిపితివేని మేము కోపగించి నిన్ను శపింపగలము' అని పలికిరి.

నాఁడు శుక్రవారము. సూర్యాస్తమయసమయ మైనది. మధుసూదనుడు దేవతాంగన లిచ్చిన విమానముపై మగధపురమున కరిగి యంతఃపురము జేరి భార్య శయ్యాగారమున గాఢనిద్రాపరవశయై యుండ నామెను మేల్కొల్పిన భీతిల్లు నని ప్రక్క రజితపాత్రమున నున్నసుగంధము నామెచెక్కులకు వ్రాసి వెడలిపోయెను. ప్రేమలత

ప్రాతఃకాలమున లేచి యథాప్రకారముగ నద్దమున మొగము జూచుకొనుచుండ చెక్కులందలి గంధపుబూత గానుపించెను. నిలువున నామె నీరయ్యెను. మరల కొంత ధైర్య వహించి యెవరో వచ్చియుందు రని నిశ్చయించి వానిజాడ నెఱుగుపట్టుదలతో నుండెను. ఆనాడు మామూలుగ తనపడకటింటిలో బండుకొను చెలులను బయట పరుండ నాజ్ఞయొసగెను. ప్రేమలత ప్రతిదినమట్లే మేల్కొని చూచుచుండెను. మరల శుక్రవార మరుదెంచెను. నాడామె మేల్కొని యుండగనే మధుసూదనుడు లోన బ్రవేశించెను. ఆమె యతడు తనభర్తయని గురుతించి నమస్కరించెను. అంత నాతఁడు తనరాక నేరికిని తెలియనీయ వలదనియు నిట్లే ప్రతిశుక్రవారమును వచ్చుచుండుననియు జెప్పి నాటి కామెతో సురతసౌఖ్య మనుభవించి దేవలోకమున కరిగెను.

కొంతకాల మిట్లు జరుగ నామె గర్భవతి యయ్యెను. ఆవిషయమును మాధవసేను డెరిగి తనకు నపవాద పాలగునని శంకించి మంత్రితో నాలోచించి యామెను పుట్టినింటికి బంపుచున్నా మనుమిషతో నొకఘోరారణ్యమున విడచి రమ్మని యాజ్ఞ యిచ్చెను. రాజభటులామె నరణ్యమధ్యమమునకుఁ గొంపోయి మామగారియాజ్ఞను దెలిపిరి. అంత నామెయు కొంతదుఃఖించి వారిని వెడలిపొమ్మని తా నావిపినంబున నిర్భయముగ సంచరించుచుండెను. అట్లుండ నాయరణ్యప్రాంతమునకు వేటకు వచ్చిన కుమారసేను డామెను గుర్తించి యామెవలన జరిగినదంతను విని తనపురంబునకు జేకొనిపోయెను. మధుసూదను డెప్పటియట్ల శుక్రవారమున నంతఃపురమునకు వచ్చి భార్యను గానక వికలచిత్తముతో దేవలోకమున కరిగెను. దేవాంగనలు తమప్రియుని ముఖమందలి విషాదరేఖల గాంచి కారణ మడిగిరి. అతడు నిరుత్తరుడయ్యెను. వా రంత దివ్యదృష్టిని జూచి జరిగినది తెలిసికొని నాథా!

మీహృదయేశ్వరి పుట్టినింట సురక్షితముగ నున్నది. బాలసూర్యప్రభా భాసమానుడగు నొకసుతుని గనినది. నీవు శుక్రవారమునాడు కొలాట మున కరిగి యామెను జూచి రమ్మనిరి.

అంతలో మరల శుక్రవారము వచ్చెను. నాడు మధుసూదను డనంతసంతోషమున మామగారింటికి పయనమై పోయి రాజాంతఃపుర మును సొచ్చి గాఢనిద్రయందున్న మాతాశిశువులను కన్నుల కరవుదీర గాంచి సంతోషపరవశుడై భార్యను మేల్కొల్పక గంధము నామె లేఁజెక్కుల కలది మరల దేవలోకమున కేగెను. ప్రేమలత ప్రభాత కాలమున లేచి గంధపుబూత జూచుకొని తనప్రాణప్రియు డరుదెంచె నని మరల శుక్రవార మెప్పు డరుదెంచునా నాపతి నెపుడు కలిసికొం దునా యని తొందర జెందుచుండెను.

వారము లెంతలో వచ్చును. ఏడుదినములే కదా గడువు. అయనములు, ఋతువులు, మాసములే కనుమూసినంతలో జరుగుచుండ వారమన నెంత? శుక్రవార మరుదెంచెను. మధుసూదనుడు తనసతిని గలిసెను. ప్రతిశుక్రవారము వత్తునని వెడలిపోయెను. ఆనాడు తొల్లింటి వలె మధుసూదనుడు తమపై మక్కువజూపుటలేదని యచ్చరలేమలు గ్రహించి 'ప్రాణప్రియా! తాము పూర్వమువలెమాపై ననురాగమును జూపుట మానిరి. మాకన్న నీభార్య సౌందర్యవతియా? జాణయా? విలాసవతియా? చాతుర్యవతియా? యథార్థమును వచింపుడు' అన నతడు దేవాంగనలారా! మనుజునకు దేవకాంతలతో పొం దెట్లు పొస గును? అదియునుగాక సతీపతులప్రేమపాశము దృఢతమము గదా? యనెను. అంత వారు మేము రాబోవు శుక్రవారమున మాసోదరిని జూడ వత్తు మనిరి.

ఆయమరనారీమణులు శుక్రవారమురాత్రి మధుసూదనునితో కుమారసేనరాజాంతఃపురమున కరిగిరి. ప్రేమలత వారి ననేకవిధముల సేవించి పూజించి యాదరించెను. వా రందులకు సంతసించి యే దైన వరము నడుగు మనిరి. అంత నామె నాభర్త నిరంతరము నాతో నుండు నట్లు ప్రసాదింపు మన్నది. వారును 'నీపతివియోగమును మేము సహింప జాలము. ప్రతిశుక్రవారము మాకడకు వచ్చునటుల నీ వనుగ్రహింపు' మని వేడిరి. ఆమెయు నంగీకరించెను. ఆదేవకాంత లామెభర్త నంతఃపురమున విడచి దేవలోకమున కేగిరి. మధుసూదనుడు మరునా డత్తమామలను దర్శించి యావద్వృత్తాంతమును నివేదించి సంతోషము గలిగించెను. కొలదికాల మటనుండి భార్యతోడను పుత్రునితోడను స్వదేశమున కరిగి తలిదండ్రులను గాంచి జరిగినసమాచారమును నివేదించి సంతసపడెను.

అని చిలుక కథ ముగించునప్పటికి తెల్లవారవచ్చుటయు ప్రభావతి రాజదూత నంపి వైచి తాను సుఖముగ నిద్రించెను.

---

# ఇరువదిమూడవనాటిరాత్రికథ.

## (రా మా మ ణి)

ప్రభావతి మరల సాయంకాల మగువఱకు నవరత్నభూషణాలంకృతయై మరుని గజ్జెలగుత్తియో యనునటుల కాలియందియలు ఘల్లుఘల్లున మోగ్రయ మందగమనంబున నందిరాజాంతఃపురంబున కరుగ పయన మయ్యెను. శుక మారమణీమణిం గాంచి నాచెప్పబోవు కథను విని పొమ్ము. అని వేడికొని చెప్ప మొదలిడెను.

కుంతలదేశమును పురూరవుడను రాజు పాలించుచుండెను. అతనికి విశాలానగరము రాజధాని. అతనిభార్య రామామణి. ఆమెయందు రాజునకు ననురాగము లేక వేరొకతెను బెండ్లియాడెను. నిరంతర మాతడు రెండవభార్యతో సరససలాపము లాడుచుకామోపభోగముల ననుభవించుచు నుండి రాచకార్యములనుగూడ మఱచెను. అతనికడ సుగుణాకరుడను బుద్ధిమంతుడు మంత్రిగా నుండెను. అతడు రాజునెన్నోవిధములనంగనాలోలతనుండి విడదీయ జూచెను. సాధ్యము కాలేదు. పురూరవుడు రెండవభార్యయందు మక్కువ గలిగినకారణమున మొదటిభార్య నొకనిర్జనారణ్యమున మేడను నిర్మించి యం దుండ కట్టడచేసెను. ఆమెయు పతిభక్తిపరాయణ యగుట నందులకు చింతింప దయ్యె. ఆమేడ యం దామెకు గావలసినసామగ్రి నంతయు నుంచి యితరులందు జొరకుండ కాపుదల చేసెను.

రామామణి తనదౌర్భాగ్యతకు మాత్రమే చింతింపుచు నొకదినమున సుగుణాకరున కొకపరి దర్శన మిమ్మని కబు రంపెను. అతడును రాణియందు మిగుల గౌరవాదరణంబులు కలవాడగుట నామెను దర్శించెను. అంత నామె మంత్రితో "సచివోత్తమా! నాపూర్వదుష్కృతవశంబున నాయందు ప్రభువునకు ప్రీతి కలుగ దయ్యె. నే నిట్లెంతకాల కాలము జనశూన్యప్రదేశమున నొంటరిగా నుండగలను. నాభర్త నన్ను ప్రేమతో జూచు నుపాయమేదైన యోచింపు మని ని న్నర్థించుకొఱకిటకు రప్పించితి" నని పలికెను. సుగుణాకరు డపుడు 'అమ్మా! నేనును నిరంతరము దానినిగూర్చి తలపోయుచునే యుంటిని. నీకు కొలదిదినములలో సుదినములురాగలవు. ఓర్చుకొనుము. కష్టములు కాపురముండవు. దీనికి విచార మందుచు శరీరమును పాడుచేసికొనకుము. ఏదేని యొక యుపాయము పన్ని రాజు నిటకు గొనివత్తును. అపు డాతనికడ

నీ వతనిచేతిరుమాలును, వజ్రాయుధంబును, ఉంగరంబును గ్రహించి యానవాళ్లుగ నుంచుకొనుము.' అని చెప్పి సెలవుగై కొనిపోయి తన కార్యసాధనకు తగినసమయ మరయుచుండెను.

ఇట్లు సుమారు రెండేండ్లు గడచెను. రాజు ప్రథమకళత్రమును పూర్ణముగా విస్మరించెను. ఇంతలో రాజునకు వేటయం దాసక్తి కలిగి మృగయావినోదార్థము తనభార్యనుంచి కట్టడిచేసిన ఘోరారణ్యము నకే పోయెను. కొంతసేపు వేటాడునప్పటికి పొద్దుగ్రుంక నుండెను. అంతలో పెద్దగాలియు వానయు నారంభమైనవి. పరివార మంతయు పికాపిక లయినది. అపుడు సమయమును గనిపెట్టియున్న సుగుణాకరుడు రాజును వేగిరించి రామామణియున్న మేడకు గొంపోయెను. రా జామెను గుర్తింపనేరక నీమె యెవ్వరని మంత్రి నడిగెను. ఆమె యొకవేశ్య యని మంత్రి చెప్పెను. రా జామెతో నాటిరాత్రి రతిక్రీడల నానందించెను. అయ్యానందసమయమున రాజు నీ కేమికావలయునని యడుగ నామె పురుషులు తమకోరిక తీరినవెనుక స్త్రీలను మరల నెక్కఱ వచ్చువఱకు మఱతురు. అక్కారణమున నానవాలుగ తమచేయుంగరమును, చేరుమాలును, ఆయుధంబును నాకు దయసేయుడని కోరెను. రా జట్లే యిచ్చి మరునాడు తనరాజ్యమున కేగెను.

ఇట్లు రెండుమాసములు గడువ రామామణి గర్భవతియై తొమ్మిదినెలలు నిండిన పిమ్మట నత్యంతసౌందర్య ప్రభాభాసమానుడగు నొక పుత్రుని గనెను. సుగుణాకరుని సహాయమున నాబాలుడు సమస్తవిద్యలందును, అందుప్రత్యేకముగ నాయుధవిద్యయం దసమాన ప్రజ్ఞావంతుడయ్యెను. ఇట్లుండ పురూరవు శోకమహావ్యాధిచే పీడింపబడుచు మరణావస్థ నుండెను. ఆసంగతి రామామణికి దెలిసి మిగుల విచారించెను.

విచారమువలన నేమిలాభ మనియు వైద్యచికిత్సచే లాభమే లేదనియు సంజీవియాకురసమున తనపతి జీవింపగల డనియు నద్దానిని దెచ్చుటకై తనకుమారుడే యర్హుడనియు ధైర్యము చేసి కుమారున కీయుదంతము నివేదించెను.

విజయసేనుడని యన్వర్థనామము నంద నర్హుడగు నాయువకుడు మిగుల నానందముతోను సాహసముతోను కుతూహలముతోను సంజీవి ని దెచ్చుటకై యొకశుభముహూర్తమున నాయుధమాత్రసహాయుడై బయలుదేరెను. అంతదనుకనే యతనిసవతితల్లికొడుకులగు జయసేన చిత్రసేను లాయాకును దెచ్చుటకు బోయిరి. ఆసంగతిని కర్ణాకర్ణిగ విజయసేనుడు వినెను. అతడు మరింత యుత్సాహమున బయలుదేరి చాలదూర మరిగి యొకచో నొకపట్టణమును జూచెను. ఆనగరము మిగుల రామణీయతతో విరాజిల్లుచుండెను.

యువకుడైన విజయసేను డానగర మంతయుఁ గలయ దిరుగు చుండెను. ఇంతలో నొక మేడద్వారమున వ్రాయసముతో నిండినబల్ల గాన్పించెను. ఆగి దానిని జదువుకొనెను. అది యొక వేశ్యవాటిక. ఆయింటియజమానినిపేరు కామకళ. ఆమె తన్ను చదరంగమున నోడించినవారికి దాసురాల నయ్యెదననియు తనచే నోడింపబడినవారు నిరంతరము తనకు దాసులుగ నుండవలెననియు నందు వ్రాసెను. ఆవ్రాతను జూచి తిరిగివచ్చునప్పు డాకామకళగర్వ మడంపవలెనని ముందునకు ప్రయాణము సాగించెను. అంత నెట్టయెదుట వేరొకపట్టణము గాన్పించెను. అప్పురమునేలు యేలిక యగుకృష్ణకాంతునికూతురు రాధిక యతిసౌందర్యవతియనియు నామెను వివాహ మాడదలంచినవా రొక రాత్రి యామెతో స్వేచ్ఛావిహారమున గడుపవలె ననియు నారాత్రి

జీవించినచో మఱునాడు డ్వాహముగు ననియు వినెను. అంత విజయ సేను డారాజుకడకు బోయి నేను నీకుమార్తెను పెండ్లాడు నభిలాషతో వచ్చితి ననెను. కృష్ణకాంతుఁడు కూతునకు నేటిరాత్రి యొకరాకపుత్రుడు వచ్చునని వర్తమాన మంపెను.

నాటిరాత్రి విజయసేనుడు నిండుగ శృంగారించుకొని రాధిక యంతఃపురమున కరిగెను. ఆమె యతనని గారవించి యొకశయ్యాగార మును జూపి యందు శయనింపు మనెను. రాజపుత్రుడు కొంతసేపు కపటనిద్ర నటించి యేమిజరుగునో చూడదలంచి యొకచో నిలబడెను.

అంత నారాధిక రెండుతొడలనుండి రెండుసర్పములు బయల్వెడలి విజయసేనునిపైకి రా నతడు వానిని తనవజ్రాయుధమున ఖండించి యొకచో దాచెను. మరుక్షణముననే యొకరక్కసి ఘోరముగ నఱచుచు నతనిపై కుఱుక దానికుత్తుక మొదలంట గోసెను.

మఱునాటియుదయమున కృష్ణకాంతు డటకు వచ్చి విజయసేను డు జీవించియుండుట కాశ్చర్యపడి తనకూతు నిచ్చి పెండ్లిచేసెను. వివాహానంతర మెదుదినము లట నామెతో విజయసేనుడు భోగముల నంది తాను సంజీవియాకున కేగుచున్నటు లామెతో జెప్పెను. రాధిక గిరివ్రజ పురమునకు రాజైన నుదయకాంతున కొకలేఖ నిచ్చెను. విజయసేను డాలేఖను గొని గిరివ్రజమున కరిగి యుదయకాంతున కాలేఖ చూపెను. ఉదయకాంతుడు లేఖనుజూచి సంతోషమున నుప్పొంగి తనకూతు రదనికను విజయసేనున కిచ్చి పెండ్లిచేసెను. వివాహమైన పిమ్మట నామెతో నాల్గుదినములు భోగపరుడై యుండి యామెతో తా నేగుచున్న కార్యమును దెలిపెను. అంత నామె రెండుఫలములను భర్త కిచ్చి తిన్నగా నిటనుండి నూఱామడదూరము పోయిన సముద్రము

వచ్చుననియు, అం దేడుప్రాకారములతో నిండిన దుర్గ మొకటి కల దనియు, అది రక్కసులచే రక్షింపఁ బడుచుండు ననియు ఆదుర్గమధ్య మున మేడలో కృష్ణకుమారియను రాజపుత్రిక కల దనియు, ఆమెను వివాహ మాడగలిగినచో నీకార్యము నామె సానుకూలము చేసి పంపు ననియు,. తొందరగా మరలి రావలయు ననియు చెప్పి బాగుగ హెచ్చ రించి పంపెను.

అతఁ డతిసాహసమున బయలువెడలి సముద్రమును జేరి యొక ఫలము నందు విసరెను. అంత సముద్రమున చక్కనిమార్గ మేర్పడెను. ఆమార్గమున బోయి ప్రాకారముల నేడింటిని దాటి రక్కసులు గాఢని ద్రలో నుండుటచే నాదివ్యసౌధమునఁ బ్రవేశించి యట కృష్ణకుమారిని జూచెను. ఆమెయు విజయసేనుని సౌందర్య సౌకుమార్యములకు వింత నొంది యతనిని బల్లిగా మార్చి గోడమీద నిడెను. ఇంతలో నామెను పెంచి పెద్దదానిగఁ జేసినరాక్షసి వచ్చెను. అంత కృష్ణకుమారి 'అమ్మా! నే నిక్లెంతకాలము వివాహము లేక యుండవలె' నని యడిగెను.

అపు డారాక్షసి ' బిడ్డా! ఏరాజపుత్రు డిటకువచ్చినను ముందు నాబలగమగు రాక్షసుల జంపును. ఆపనిని చేయునివానికి ని న్నిచ్చి వివా హాము చేసెద' నని యామె పలుక బల్లిగా నున్నవిజయసేనుని నిజరూప మందునటులఁ జేసెను. ఆరక్కసి వారిద్దరకు పెండ్లి గావించెను. వివా హానంతరము రాజపుత్రు డామెతో మూడుదినములు ముమ్మరముగ భోగంబులననుభవించి తనకార్యము నామెకు దెలియపఱచె. ఆమె రక్కసికి జెప్పినది. అపుడు రక్కసి విజయసేనునకు కొంతగంధము నిచ్చి 'రాజపుత్రా! ఇట కుత్తరదిశగా నొకతోట గలదు. దానిలో రాక్ష సరా జుండును. అత డీసంజీవిచెట్టుక్రింద శయనించియుండును. ఈగంధ మతనిపై జల్లి చెట్టెక్కి వలసినంతయాకును గోసి తొడతో నిముడ్చుకొని

తొందరగా రమ్మని చెప్పి పంపెను. విజయసేను డామె చెప్పినటుల చేసి సఫలీకృతమనోరథుడై మరల కృష్ణకుమారిమేడకు వచ్చి తనప్రియాణ మానాడే యని రక్కసికి దెలిపెను. ఆమెయు నమూల్యరత్నాభరణం బుల నల్లునకు కూతునకు నిచ్చి విమానముపై బంపెను.

విజయసేనుడు మరలివచ్చునపుడు రెండవఫలమును సంద్రమున నైవ మార్గ మేర్పడెను. అందుండి కృష్ణకుమారితో వెడలి గిరివ్రజము నకు వచ్చి విమానముపై రెండవభార్యయగు రదనిక నెక్కించుకొని యత్తమామల సెలవంద మొదటిభార్యయగు రాధికను జేరి యామెను విమానముపై నెక్కించుకొని కామకళయను వేశ్యయున్న పట్టణమునకు వచ్చెను. కామకళను చదరంగమున నోడించి యామెవద్ద నున్నధన మంతయు గైకొని లోగడ చదరంగమున నామె కోడి దాస్యమును చేయుతనసవతితల్లికుమారులగు చిత్రసేన జయసేనులను విడిపించి వారి తోబాటు తక్కినరాజపుత్రులనుగూడ విడిపించెను.

అంత రాధికా రదనికా కృష్ణకుమారికలతోను తనసోదరుల తోను బయలుదేరి స్వదేశమునకు పయన మయ్యెను. జయసేనచిత్రసే నులు సంజీవియాకు దెచ్చెద మనిరి. నే నిదివరకే దానిని తెచ్చితి నని విజయసేనుడు చెప్పెను. అప్పటినుండి సోదరు లతని నెట్లయిన మార్గ మున మట్టుబెట్టి యాకు తామే తెచ్చితిమని తండ్రికి జెప్ప నిశ్చయించు కొనిరి. ఇంతలో విజయసేనున కొకనిర్జనారణ్యమున బోవుచుండ దాహ మయ్యెను. అత డాప్రాంతమందలి యేటికి నీరు ద్రావ నేగెను. మాత మ్ముడు తొందరగ రాడు. మేము చేకొని వత్తుమని మఱదండ్ల నట విడచి జయసేనచిత్రసేనులు విజయసేనుడు నీరు ద్రావుచుండుయేటికి బోయి యతనిని వెనుకబాటున చంపి సంజీవియాకును జేకొని పురం

బున కరిగి తండ్రిని బ్రతికించిరి. ఆతడు కుమారులప్రజ్ఞకు మెచ్చుకొని సంతసించి రాజ్యపాలనము జేయుచుండెను.

విజయసేనునిభార్యలు భర్త రామికి వగచి యరణ్యము నంతను వెదకి యేటియొద్దున పతనిశల్యములను గాంచి తమప్రభావమున భర్తను జీవింపజేసిరి. అటనుండి ప్రయాణము సాగించి కుంతలమునకు వచ్చి యొకచో నుండిరి. అట సంజీవియాకు పోవుట రాక్షసుడు గుర్తెరింగి కుంతలమునకు రాక్షసమూకతో వచ్చి పురూరవుని సకుమారముగ ససైన్యముగ బంధించెను. అది విజయసేనుడు విని రాక్షసమూకను చించి చెండాడుచుండ రక్కసి యుల్లని గుర్తించి రాక్షసునితో జెప్పి వారినందరను విడిపించెను. రాక్షసుల నురుమాడిన విజయసేనునకు పురూరవుడు నమస్కరింపబోయెను. అదివఱకే విజయసేనుని బసనున్న పురూరవుని మొదటిభార్య రామామణి వచ్చి పతికి మ్రొక్కి 'నాథా! ఇతడు తమపుత్రుడు. తాము వేటకు వచ్చినపుడు నాయింట నొకరాత్రి గాలివానకు తాళజాలక బసచేసిరి. తా మిచ్చిన చేతిరుమాలు, ఉంగరము, ఆయుధములను గురితింపుడు. ఇవిగో!' యని ముందు పెట్టెను.

అపుడు పురూరవుడు పుత్రుని కౌగలించుకొని జరిగినసమాచార మంతయు పతనివలన విని విజయసేనునకే పట్టము గట్టెను. జయసేనచిత్రసేనుల వధింప నాజ్ఞనీయ విజయసేనుడు వారించి తనకడ మంత్రులగా నుంచుకొనెను. అని చిలుక కథను ముగించునప్పటికి తెల్లవార వచ్చుటయు ప్రభావతి నాటికి పయనము మాని కొంతవడి నిదించెను.

---

# ఇరువదినాల్గవనాటిరాత్రికథ.

(లావణ్యమయి.)

మఱునాటిసాయంకాలమునకు మరల ప్రభావతి తటిల్లతవోలె మెఱయుచు శృంగారలీలావిలాసకుతూహలాయత్తచిత్తతతో నొయ్యారముగ నుపపతిఁ గలియ తమకంబున బోవుచుండ శుకరాజంబు ఓబిడ్డా! ఇక్కథను వినిపొమ్ము. అని వారించి యిట్లు వచింప నారంభించెను.

పూర్వము కళింగదేశమును వరరుచియను రాజోత్తము డేలుచుండెను. అతనిభార్య సుగుణమణి. ఆమెయందు చిరకాలము సంతతి కలుగనందున వరరుచి యనేకదానములు, వ్రతములు, తీర్థయాత్రలు చేసిచేసి విసుగంది స్వదేశమును చేరెను. అట్లుండ నతనిరాజ్యమున కొకసన్యాసి వచ్చెను. అతనిమహాత్మ్యము కొలదిదినములలో కళింగదేశ మంతయు వ్యాపించెను. వరరుచి సిద్ధుని ప్రఖ్యాతిని విని సన్యాసిని దర్శింప పాదచారియై పోయెను. అతడును రాజును గౌరవించి 'నీవచ్చిన కార్య మే నెరింగితిని. సంతతి వాంఛించుచున్నావు. ఈకమండలోదకమునందలి యొకబిందువును నీభార్యశిరమున జల్లితివేని నీకు పుత్రుడుదయించును.' అని చెప్పి యుదకము నొసంగెను. రాజంతఃపురింబునకరిగి యొకనీటిబిందువు నామెశిరమున నుంచెను. ఆమె యద్దాని నించుక తిరస్కారభావముతో స్వీకరించెను. రాజు మరల సిద్ధుని దర్శింప నేగ నతండు రాజా! నీ వెంత దురదృష్టవంతుడవు. నీభార్యశిరమున నీ వుంచిన నీటిబిందువు నామె తిరస్కారభావముతో స్వీకరించెను. అట్లగుట నామెగర్భమున నొకమత్స్యము జనించును. అని పలుక రాజు నిర్విణ్ణుడై నాగతి యింతయేనా యని విచారపడెను. మత్స్యముగ గొంతకాలముండినను నీపుత్రుడు గొప్పవాడై తుదకు నీవంశమునకు ఖ్యాతి

దెచ్చును. పొమ్ము అని యూరడించి పంపెను. రాజు సిద్ధునిసెల వంది తన గృహమును జేరెను. సన్యాసియు నెటకో పోయెను.

సుగుణమణి నిండుచూలాలై యొకమత్స్యమును గన్నది. కాని యామె చాలనందులకు విచారించినది. ఈసమాచార మొకగంధర్వు డెఱిగి యాచేపలో నంతర్హితుండై యుండెను. రాజు తనపుత్త్రునకు మీనరాజని నామకరణంబు చేసెను. వరరుచియొక్క మంత్రి యీ సమాచారము నెరికి దెలియనీయవలదని రాజునకు బుత్త్రుడు కలిగినట్లు సాటింపజేసెను. పుత్త్రోత్సవము, జాతకర్మ, నామకరణము మొదలగు నుత్సవములు జరిపించి సమస్తవిద్యలను తగినగురువులచే నేర్పించుచుం డెను. అతడును సమస్తవిద్యలనేర్చి యౌవనప్రాయుం డయ్యెను. అంత నతనికి వివాహముచేయ దలచి దేశదేశములందు గన్యకల వెదకించెను. అపుడు మాళవదేశాధీశ్వరుడు తనకుమార్తెలలో పెద్దదగు లావణ్యమయి నిచ్చి వివాహము చేసెను. క్షత్త్రియకులోచితంబుగ నావివాహము ఖడ్గంబునకు జరిగెను. అందుచే వధూవరులొండొరుల జూచుకొన నేరరి. కొంతకాలమున కాదంపతులకు పునస్సంధానమును జరిపి యంతఃపురమందలి సౌధోపరిభాగమున నొకగదిలోనికి బంపిరి. ఆమె తనభర్త మత్స్యమగుట నెఱింగి చాల విచారించి నిదురించెను.

లావణ్యమయి నిదురించినపిమ్మట నాచేపనుండి గంధర్వుడు బయటకువచ్చి యామెతో రతిక్రీడల నానందము నంది మరల నందే ప్రవేశించెను. ఇట్లు కొంతకాలము జరుగ లావణ్యమయి గర్భమును దాల్చెను. ఆసంగతి రా జెఱింగి కోపోద్రిక్తుండై యుండ భార్య యతనిని వారించి మత్స్యరూపముననున్న మనకుమారునం దేదో మాహాత్మ్య మున్నది. అంతియేకాని మనకోడలు మిగుల గుణవతి యని

నచ్చజెప్పెను. రాజుకూడ సమ్మతించి పలువిధముల నారహస్య మెఱుంగుటకు గట్టిదిట్టములను జేయించెను.

ఇంతలో నొకదినమున భాగవతంబు జరిగెను. లావణ్యమయి నిదిరించినపిమ్మట గంధర్వుడు చేపతోలు నట విడచి తొందరగా భాగవతమును చూడబోయెను. గంధర్వు డేగినకొలదినిమిషములకే లావణ్యవతి మేల్కొని యాచేపతోలును దాచినది. గంధర్వుడు భాగవతము నుండి తెల్లవారకముందే వచ్చి చేపతోలు గానక తొట్రుపడుచుండెను. లావణ్యవతి నే నాతోలును బారవైచితి నని పలికి తనభర్త నత్తమామలకు జూపి యామత్స్యమందలి మాహాత్మ్యను వెల్లడించెను. వారును మిగుల సంతసించి తమకుమారునకు నిండుసభలో నానాడే పట్టాభిషేకోత్సవము జరిపిరి.

ఇంతలో మాళవదేశపురాజు తనకూతురు నిండుచూలా లైన దని విని యామెను పుట్టినింటికి గొంపోయెను. ఆరాజున కిద్దరు భార్యలు కలరు. లావణ్యవతి పెద్దభార్య కూతురు. రెండవభార్య తనసవతిబిడ్డ యగు లావణ్యవతి వైభవమును గాంచి యోర్వలేనిదై మాయోపాయమున నామెను చంపదలంచి తనమేడకు విందునకు బిలచి 'అమ్మా! మనదేశాచారము ననుసరించి గర్భవతు లైన స్త్రీలు విందుల కరుగునపుడు కన్నులకు గంతలు గట్టుకొని యూరువెలుపలనున్న మఱ్ఱిచెట్టు క్రింద నొకమారు పోయి రావలె ' నని చెప్పి యటకు గొంపోయి యం దొకపెద్దపుట్టలో నామెను బారవైచి వచ్చెను. ఆసంగతి యెవ్వరికి దెలియకుండునటుల లావణ్యవతి ప్రసవించి యాడుశిశువును గనిన దనియు నాపిల్ల పుట్టినప్పుడే పోయినదనియు రాజు మొదలగువారికి వర్తమాన మంపి యామెను దనయింటనే కొద్దికాల ముంచుకొందు నని చెప్పినది.

అంత నామె తనకుమార్తెను శోభాయమానముగం శృగారించి రాజుకడకు దీసికొనిపోయి, మనలావణ్యవతి భర్తకొలకు పరితపించు చున్నది. నేడే యామె నత్తవారింటికి బంపుట మంచిది. అని రాజును పురికొల్పి కళింగరాజ్యమున కంపెను. మీనరా జామెను గాంచి యసహ్యపడి యామెతో పలుకాడుటగూడ లేదు. మీనరా జొకదినమున వేట కరిగెను. ఆయరణ్యమునందు కొందఱు గాజులవర్తకు లొకచో జేరి శోకించుచుండిరి. మీనరాజు వారిని గాంచి యేల మీ రిట్లు శోకించుచున్నారని ప్రశ్నించెను. అంత వారు 'ప్రభూ! మేము నాగలోకమునకు నాగరాజకుమార్తె పంపినయాహ్వనముపై నేగి యామెబిడ్డకు గాజులు తొడిగితిమి. అందుల కామె మాకు బహుమానముగా నమూల్యంబులగు గొన్నిముత్యముల నొసంగినది. అవి యెక్కడనో పోయినవి. అందులకు విచారించుచుంటి మనిరి.

మీనరాజు నా కాచోటు చూపుమన వా రతనిని లావణ్యమయిని సవతితల్లి త్రోయించినపుట్టను చూపిరి. అంత మీనరాజు, వర్తకులారా! మీ రాపుట్టకడకు బోయి "గాజులో" "గాజులు" అని బిగ్గఱగా నఱువుడు. అన వా రట్లు చేసిరి. ఆకేకలు విని లావణ్యమయి పుట్టలోనుండి బయటకు వచ్చెను. ఎట్టయెదుట తనభర్త గాన్పింప నమస్కరించెను. ఆసమాచారము నాగరాజునకు దెలిసి యల్లుని చేకొనిపోయి బహూకరించెను. కొలదిదినంబు లటనుండి భార్యను శిశువును దోడ్కొని నాగరాజు సెలవంది కళింగదేశమునకు జేరి తలిదండ్రులను సంతోషపఱచెను. అచట తనకు భార్యగా నటించునామెను వెడలగొట్టి లావణ్యమయితో సుఖంబుగ నుండెను.

అని చిలుక తనకథ ముగించునప్పటి కర్ధరాత్రిమగుటయు ప్రభావతి రేపువత్తు నని రాజునకు వార్త నంపి నిద్రించెను.

# ఇ రు వ ది యై ద వ నా టి రా త్రి క థ.

## (మ ద నుఁ డు)

ప్రభావతి యెప్పటియట్ల మరునాటి సూర్యాస్తమయసమయము నకు నవమోహనాకారముగ నలంకరించుకొని నందిరాజాంతఃపురంబున కరుగ నుండెను. అంత నామెప్రయాణసన్నాహమును గుర్తించిన చిలుక అక్కా! ఇక్కథను విని వెడలుము. అని కథ చెప్ప మొదలిడెను.

తొల్లి కాశ్మీరదేశమున అనంతవర మనునొక పట్టణరా జముం డెను. దానిని వీరసేను డనునేలిక ధైర్యసాగరు డనుమంత్రిసాహాయ్యమున నేలుచుండెను. అతనికి మదను డనుపుత్రు డుండెను. అతఁడు విద్యావంతుడును గుణవంతుడునై యౌవనవంతు డయ్యెను. వీరసేను డతనికి వివాహము చేయ నిశ్చయించి తగినవధువునకై వెదకింప రాజోద్యోగులను దేశ దేశముల కంపి యా యారాజపుత్రికల చిత్రపటము లను దెప్పించి చూపుచుండెను. మదనున కం దొకటియు నచ్చలేదు. ఇంకను వారు దేశములను దిరుగుచుండిరి.

ఇట్లుండ సింహళదేశపురాజు యౌవ్వనవతియగు తనకూతునకు దగినవరు నన్వేషింప బండితులను దేశదేశములకు నంపి రాజపుత్రులచి త్రిపటములను దెప్పించి కుమార్తెకు జూపుచుండెను. అం దొక్కటియు నామెమనసున కెక్కలేదు. వారును దిరుగుచునే యుండిరి. వీరసేనమ హారాజు పంపినరాజోద్యోగులును సింహళద్వీపమహారాజుపండితులును, ఒకగొప్పసత్రమునందు గలిసికొనిరి. ఒకరితో నొకరు సంప్రతించు కొని చిత్రపటములను తారు మారుగ బుచ్చుకొని తమరాజుల కంపిరి. రెండుతావులనుండియు నచ్చినటుల జాబులు వచ్చినవి. వెంటనే వివాహయత్నముల సాగించి సింహళరాజు మదనునకు దనకూతు

నిచ్చి వైభవముగ బెండ్లిచేసి యనేకములైన కానుకల నిచ్చి కూతు నల్లునితో బంపెను.

మదనుడు చిన్ననాటినుండియు చిత్రరేఖ యనునొక వేశ్యతో సంబంధము గలిగియుండె. భార్య వచ్చినపిమ్మట నామెకడకు బోవుట మానెను. చిత్రరేఖ యొకదినమున రాజోద్యానమున మదను గలిసి కొని నామీద దయ తప్పినది. తమ యర్ధాంగి మిగుల సౌందర్యవతి కాబోలును. ఆమెచిత్రపటము నొకసారి నాకు దయచేసి చూపు దని వెడలిపోయెను. మదనుడు తనభార్య చిత్రపటమును వేశ్యయింటికి గొంపోయి యామె కిచ్చెను. ఆమెయు దాని నొకచో దగిలించి ముందు మదనునితో మదనక్రీడల నోలలాడి యతడు నిద్రించిన వెనుక నతనిభార్య చిత్రపటమును జూచి ఇంత యందగత్తె యగుటనే నానోటిలో దుమ్ము కొట్ట గలిగినది దీనిపై నెట్లయిన రాజపుత్రిక కసహ్యము గలిగింపవలెను. అని తలపోసి యామెకీగంటి నొకసున్నపు ముక్కతో గీసి మదనుడు లేవగానే "నీభార్య యింత సౌందర్య వతియా? గ్రుడ్డిదానిని జూచి పొంగుచుంటివా?" అని వెక్కిరించి యతనిని ముద్దాడి కౌగిలించి హెచ్చరించి యుత్సాహపఱచెను.

మదనుడు నాటనుండి యింటికి పోవుట మానెను. అతనిభార్య నాతో సుఖంపక పోయినను కంటి కగపడుచుండిన చాలునని విచారిం చుచుండెను. ఇట్లుండ నొకదినమున మదనుడంతఃపురమున కరిగి పగలం తయు నుండి చీకటిపడగానే భోజనము చేసి తమలము చేయుచు వేశ్య యింటికి బోవ పయన మయ్యెను. అంత నాతనిభార్య 'నాథా! కొంచె ము సున్నము నిచ్చి పొం' డనెను. అంత నతడు కోపించి 'ఓకురూపిణీ! జక్కులయడవి నగరమై జక్కులపక్షికి రెక్కలు వచ్చి, అవిసెను

పగడాలు, మునగను ముత్యములు పండి, తిమ్మనగుంట నీరు తీయ్యనై గుండు తేలి, బెండు మునిగి నీచెప్పు లారుమాసములు మోసినప్పుడు సున్నము తెచ్చి యిచ్చెద' నని వేశ్యయింటికి పోయెను. అంత నామె పుట్టినింటికి బోదలచి తండ్రికి జాబు వ్రాసెను. అతడు తనమంత్రిని కూతును చేకొని రమ్మని పంపెను. మంత్రి రాజాజ్ఞను బడసి యామె ను పుట్టినింటికి దీసికొని వచ్చెను. ఆమె తండ్రిని జేరి జక్కులయడవి నగరముగా చేయింపవలెను గాన నాకు గొంతద్రవ్య మి మ్మనెను. అతడు కొల్లగా ధనము నిచ్చెను.

ఆధనముతో నామె జక్కులయడవి కొట్టించి గొప్పపట్టణమును నిర్మించెను. అందలిపక్షులకు రెక్కలు వచ్చెను. నగరప్రాంతమున నొకసరోవరము త్రవ్వించిదానియొడ్డున నవిసెలు మునగలు పాతించెను. ఆచెరువులో కొన్నివందలపుట్ల బెల్లమును వేయించెను. గుంటనీరు తీ పయ్యెను. అవిసెను పగడములను మునగను ముత్యములను ఏర్పాటు చేసెను. ఇట్లుండ వీరసేనుని రాజ్యము శత్రుల వశమై పారివచ్చి యామె గట్టించిన పట్టణమునకు కుటుంబముతో వచ్చి పుల్లలను గొట్టుకొని జీవించుచుండెను. పురుషరూపమున నున్నవీరసేనుని కోడలు మామను భర్తను గురుపట్టి వారికి తనకడ నుద్యోగముల నిచ్చెను. మదనునకు తాంబూలమునకు సున్నము రాసి యిచ్చు నుద్యోగము నొసగెను.

ఇట్లు జరుగుచుండ నొకదినమున నారాజపుత్రిక నిండుసభలో పతి నుద్దేశించి, 'జక్కులయడవి పట్టణ మయ్యెను. జక్కులకు రెక్కలు వచ్చెను. తిమ్మనగుంటనీరు తీ పయ్యెను. గుండు మునిగి బెండు తేలె ను. తాంబూలము నిచ్చు నుద్యోగము చేసితిరి. ఇప్పుడైన సున్నమును

తెచ్చి యిత్తురా? న న్నేలుకొందురా?' యని తనపురుషరూపమును తొలగించెను. మదనుడు వారకాంతమాటలను నమ్మి మోసపోతినని చెప్పి పశ్చాత్తాప మందెను. అంత నామె తండ్రివలన గొంతసైన్యమును దెప్పించి యీయగా మదనుడు కాశ్మీరమున కరిగి తనరాజ్యమునుండి శత్రులను పాఱదోలి మరల రాజ్యమును స్వీకరించెను. సుఖముగ రాజ్య పాలనము చేయుచుండెను.

ఈరీతిగా చిలుక కథను ముగించునప్పటికి తెల్లవారవచ్చుటయు నాప్రభావతి యానాటి రాజాంతఃపురమున కరుగు యానము నాపి దూత నంపివైచి సుఖముగ నిద్ర జెందెను.

---

## ఇరువదియాఱవనాటి రాత్రికథ.

### (చిలుకస్వంతకథ)

మఱునటిసాయంకాలమున ప్రభావతి ముకురమున కెదురుగ నిలచబడి ముమ్మరముగ సిగను మల్లెలు మొల్లలు జుట్టి జల్లిచీర గట్టి తొల్లిటిశృంగారమును వెల్లివిరియజేయుచు నందిరాజాంతఃపురంబునకు మెల్లమెల్లన పో నుద్యుక్తయగుట చిలుక జూచి అమ్మా! తొందర కూడదు. నాచెప్పుకథను వినినపిమ్మట పోవచ్చును. ఇది నాజీవిత వృత్తాంతమును వెల్లడించు కథ యని యిట్లు చెప్ప నారంభించెను.

నేను వెనుకటిజన్మముగ విక్రమార్కమహారాజును. పరకాయ ప్రవేశవిద్య నేర్వ నుజ్జయినినుండి బయలువెడలి మహాగహనంబులను దాటి హేమకూటమునకుబోయి తత్పర్వతప్రాంతమున నున్ననొకముని నాశ్రయించితిని. అతఁడు నా కావిద్య నేర్పుచుండ నావెనువెంట

నొకవిశ్వకర్మకులజుడు వచ్చి చాటుననుండి యావిద్యను గ్రహించెను. వాడును నేనును గలిసి నవరత్నపురమున కరిగితిమి. ఆరాజకుమారుని తన్ను మూడుమారులు మాటాడించినవానిని పెండ్లాడుననుటల వింటిమి. ఆకంసాలి నాకు దెలియకుండ రాజపుత్రికసౌధంబున కేగి తలవైపున గూర్చుండవలెనో కాళ్ళవైపున గూర్చుండవలెనో తెలియక కాళ్లవైపున నామెమంచముపై గూర్చుండెను. ఆమె మాటాడలేదు. అంత నాతడు భయపడి యొక శునకములో దూరెను. ప్రాతఃకాలమున రాజభటులు వానిశవమును కందకమునవైవ జాడ గనిపెట్టి యందు జొచ్చి నాకడకు వచ్చెను.

మఱునాడు రాజపుత్రికసౌధమున కే నేగి నాయిలవేల్పగు భేతాళుని దలచితిని. అతడు నా కొకనిమ్మపం డిచ్చెను. దాని నామె మంచముపై నుంప నది కాళ్ళవైపునకు దొర్ల నేను తలవైపు గ్రహించి యట కూర్చుంటిని. భేతాళుడు నీ కేమికావలయు నని యడుగ నీమెను మూడుమారులు మాటాడింపవలె నంటిని. అతడు నే నీయింటి లోని వస్తువులం దావేశించి కథలను జెప్పి మేల్కొల్పుదు ననెను. అట నున్నదీపస్తంభమును నేను జూచి యొకకథ చెప్పి రాజపుత్రికను మాటలాడింపు మంటిని. అంత నా స్తంభమున భేతాళుడు దూరి కథ నేను చెప్పలేను. ఎవ రైన చెప్పిన యూకొట్టుదు ననెను.

అపుడు నేను రాజపుత్రికచెవులనున్న కమలములను గాంచి యొకకథ చెప్పుమంటిని. అంత నవి మే మామెచెవుల నిఱికికొని యుంటిమి. ఎట్లు చెప్పుదు మన్నవి. రాజపుత్రిక యాకమలములను దీసి బంగారుపళ్ళెమున నుంచినది. అంత నవి యిట్లొకకథను జెప్పినవి.

---

# కమలములు చెప్పిన కథ.

పూర్వ మొక బ్రాహ్మణుడును కంసాలియు, వడ్రంగియు, సాలెయు మిగులస్నేహమున నుండిరి. వా రొకప్పుడు దేశసంచారము చేయ బయలుదేరిరి. ఒకరాత్రి కొకసాంద్రారణ్యమును జేరి యందు కాళికాలయమున విశ్రమించిరి. పరుండునపుడు ఝామున కొకరు మేలకువగా నుండవలె నని నిర్ణయించుకొనిరి. మొదటి ఝామున మేల్కొన్న వడ్రంగి కొయ్య నొకదానిని చెక్కి స్త్రీరూపముగ జేసి నిద్రించెను. రెండవఝామునన మేల్కొన్న సాలె యాప్రతిమకు చక్కనివస్త్రములను నేసి కట్టి నిదురించెను. మూడవఝామున కంసాలి మేల్కొని యామెకు నగలను జేసి పెట్టి నిద్రించెను. నాలవజామున బ్రాహ్మణుడు లేచి తనమంత్రప్రభావమున నామెకు జీవము పోసెను. ఆస్త్రీ యం దెవ్వరిని వరింపలెను. నలుగురు మోహించిరి. దీపస్తంభమా! నీవు చెప్పుమన వడ్రంగి నని చెప్పినది. అంత రాజపుత్రి 'కాదు' అన్నది. నే నపుడు ఒకమా టయ్యో నంటిని. అపు డచటనున్న తెర నొకకథ చెప్పుమన నది యిట్లు చెప్పినది.

---

# తెర చెప్పిన కథ.

వా రావిధంబున కలహించుచుండగనే యాస్త్రీ మరణించినది. ఆమెను గాల్చి యొకరు యెముకలను వేరొకరు బూడిదను బంచుకొనిరి. మరొకరు దుఃఖములోను, యింకొకరు రిక్తహస్తములతోను వెడలిపోయిరి.

పూర్వము కన్యాకుబ్జమునకు దగ్గఱగా నొకబ్రాహ్మణాగ్రహార ముండెను. అం దొకవిప్రునింటి కొక మహానుభావు డతిథిగా వచ్చెను. వంటయైన దని యతిథిని యింటియజమాని స్నానము చేయవలసినదిగా చెప్పెను. ఆబ్రాహ్మణుడు నదికి బోయి స్నానముచేసి వచ్చువఱకు నాయింటియజమానురాలు క్షుద్బాధతో నేడ్చుచుమూర్తైను కోపము తో కణకణ మండునిప్పులతో నిండినపొయ్యిలో పారవైచెను. అని తెర చెప్పుచుండగ:-

రాకొమరిత యాత్రముతో "ఆశిశువు మరణింపలేదా?" అని యడిగెను. అంత నేను రెండుమారులు పలుకరించితిని సుమా యంటిని.

తరువాత నారాజపుత్రిక ధరించియున్న కంచుకము నొకకథను చెప్పు మంటిని. కంచుకము చెప్పుచుండ నామె కట్టిన పావడ యూకొట్టుచుండెను.

---

# కంచుకము చెప్పిన కథ.

భోజనమునకు వచ్చిన యతిథి యింటియజమానిని గాంచి విప్రోత్తమా! నీయర్ధాంగి కన్నకూతును జంపినది. శిశుహత్య మహాపాతకము లలో నొకటి. నీయింట నేను భోజనము చేయ నొల్ల ననెను. అంత నాయింటివిప్రుడు లోపలికి బోయి యొకయపూర్వతాళపత్ర గ్రంథమును గొనివచ్చి యాపొయ్యిలోని బూడిదను బొమ్మగా చేసి యాగ్రంథమును మూడుమారులు పఠించ నాశిశువు జీవించినది. అతిథి భుజించి రాత్రి యచటనే పండుకొని యర్ధరాత్రమున నాతాళపత్రగ్రంథమును దొంగిలించుకొనిపోయెను. ఆదొంగిలించిన బ్రాహ్మణుడు

పూర్వము దేశాటనకు బయలుదేరి త్రోవలో వడ్రంగి చేసినకొయ్య బొమ్మ కాయువు పోసినవాఁడు. సరల నీగ్రంధము నామెభస్మ మున్న చోటికి గొనిపోయి మూడుమారులు త్రిప్ప నామె జీవించెను. ఆమె యెవ్వరిని పెండ్లాడవలయు నని ప్రశ్నింప వావడ 'ప్రాణ మిచ్చి బ్రతి కించినవానినే వివాహ మాడవలయు' నన రాజపుత్రి "కాదు. మా నము గాచినవాఁడెవానిని" అనెను.

అంత నేను మూడుమారులు మాటలాడించు టయ్యె నంటిని. ఆమె వెంటనే నాప్రక్కకు జేరి కౌఁగిలించి ముద్దాడి యానందమున దే ల్చెను. కొంతకాల మటనుండి యామెను పెండ్లాడి యుజ్జయినికి బయన మైతిమి. కంసాలి నా వెంటనే యుండెను. ఒకరాత్రి మే మొకసాంద్రా రణ్యమున విశ్రమించితిమి. మే మేవృక్షముక్రింద పరుంటిమో యాచెట్టు పయి నొకమగచిలుకయు నాఁడుచిలుకయు పోరాడుచున్నవి. మగచిలుక చచ్చి నాప్రక్కన బడినది. నే నాచిలుకబొందిలో ప్రవేశించి యాఁడు చిలుకతో బోరాడుచుంటిని. అపుడు కంసాలి నాశరీరములో బ్రవే శించి తనశరీరమును దిగులపెట్టి నాభార్యకడ కరిగి 'చెలీ! ఎన్నాళ్లకు గలసికొంటిమి.' అన నామె యతనికంఠస్వరమును బట్టి నాభర్త కాఁడ ని యనుమానించినది. నా కొకవ్రత మున్నది. ఆరుమాసములు దీక్ష. అంతవఱకు నన్ను తాఁకరా దన్నది. అప్పటినుండి యాకంసాలియే పరి పాలన జేయుచుండెను. నేను చిలుకరూపమున చెట్టుపై నుండ నొకవేట కాఁడు నన్ను పట్టి నీభర్త కమ్మెను. తరువాయిసంగతి నీవెఱింగినదే.

ఇంతలో తెల్లవారుటయు ప్రభావతి యించుకసేపయిన నిద్రింత మని శయ్యాగారమున కరిగినది.

---

# ముప్పదియవనాటిరాత్రికథ.

మఱునాటి సాయంకాలమునకు ప్రభావతి మరల రెండవరతీదేవియా యనునటుల ననంతలీలా మనోహరముగ శృంగారించుకొని రాజపుత్రుని గలియుట కువ్విళ్లూరుచు బయనము కాగా శుకరాజ మామెను గాంచి, ప్రభావతీ! ఇప్పటి కొక్కటి తక్కువగ ముప్పది రాత్రులనుండి ముప్పది కథలను జెప్పితిని. నీమనం బాప్రయత్నము నుండి తిరుగ దయ్యె. నాయజమాని వచ్చుదనుక నీకు కథలను జెప్పి ని న్నాపి సన్మార్గమునకు ద్రిప్పుట నావిధి. అట్లు కానిచో నేను కృతఘ్నురాల నగుదును. నీ విప్పుడు నాచెప్పబోవుకథను సాంతముగ విని నీహృదయంబున దూరాలోచనము చేసి పొమ్ము. అని కథ నిట్లు చెప్ప నారంభించెను.

పూర్వము చోళదేశమును విజాపురము రాజధానిగా జేసికొని వసుదేవు డనురా జేలుచుండెను. అతని కొకపుత్రుడు కలడు. అతని నామధేయము సుకుమారుడు. అత డనేకవిద్యాలం దారితేరి కామ శాస్త్రమునందు బ్రత్యేకపాండిత్య మలవఱచుకొనెను. పదునారేండ్లు వచ్చుసరి కాతడు కళాభిమానియై యౌవనవంతుడై భాసిల్లెను. తండ్రి యతనికి వివాహోచితవయస్కు డగుట పెండ్లిచేయ నిశ్చయించెను. సుకుమారుడు తనప్రశ్నములకు సదుత్తరములను జెప్పగలిగిన కన్యనే వివాహ మాడుదునని తండ్రి కెరింగించెను. ఎంత ప్రయత్నించిన నట్టిరాజపుత్రి యేబదియారుదేశములందును లభింప దయ్యె. అందుచే సుకుమారుడు సింహళద్వీపమున కరిగెను. ఆరాజున కొక పుత్రిక కలదు. ఆమెపేరు సుధ. సుకుమారు డాద్వీపమున రాజోద్యానమున కరిగి యొకచెట్టునీడ రత్నమయవేదికపై మార్గాయాసమును దీర్చుకొన

విశ్రమించెను. సుధ యావనంబునకు చెలికత్తెలతో పువ్వులను గోయ వచ్చి నిద్రాముద్రితుఁడై యున్నసుకుమారుని సౌందర్యమునకు మెచ్చి యతనిని తనయంతఃపురమందలి సౌధమునకు గొంపోయెను.

సుకుమారుఁడు మేల్కొని తనయెదుట నున్న లలనామణిం గాంచి నీ వెవ్వరవు? నీ పేరేమి? నే నిట కెట్లు వచ్చితిని? ఇట్లొంటరిగ స్త్రీలకడకు పురుషుడు వచ్చిన నేమందురు. అని పలుక నే నీ సింహళరాజుపుత్రికను. నాపేరు సుధ. నీసౌందర్యమును దిలకించి వదల లేక ని న్నిటకు నేనే తెప్పించితి. నాతొందరపాటును మన్నింపుము. నిన్ను వివాహ మాడుదలంపు నాకు నిలచిన దనెను.

అంత సుకుమారుడు నిండుసభలో నావమానము గాపాడ శక్తి యుండిన నిన్ను పెండ్లాడుదు ననెను. ఆమె యంగీకరించెను. వా రిరువురకు వివాహము జరిగెను. కొలదిదినంబు లటనుండి భార్యతో తనదేశమునకు బయలుదేరి సంద్రమును దాటి యొకకాననమున బ్రవేశించిరి. సుకుమారున కాకలి యగుట భార్య నట నాపి తాను సమీపపట్టణమున నొకసెట్టియింటి కేగి హారమును గొదువ బెట్టి సంభారముల నిమ్మనెను. ఆసెట్టి వీనియదంత మడిగి భార్య కాననమున నున్నటు లెఱింగి యామెను దెమ్మని నలుగురుసేవకుల నంపెను. హార మాలవాలుగ జూపి నీభర్త ప్రమాదస్థితిలో నున్నటుల దెల్పు డని హార మిచ్చెను. సుకుమారుని వత్తునని తలవాకిట నిలబెట్టెను.

రాజభటు లట్లే పోయి యామెను దెచ్చి దొడ్డిదారి నింటిలో బెట్టిరి. సెట్టి యామెను మోహించి సుకుమారునకు సంభారముల నిచ్చి పంపెను. వెంటనే సెట్టి లోని కేగి తనకోరికను దెలిపెను. ఆమె నయమునసే వీనిని లొంగదీయవలెనని మోసమును గ్రహించి తన కొక

పైబడి వారిలో నూరు నఱకుకొని చచ్చిరి. తనపురమును శత్రులనుండి కాపాడినది పురుషవేష యూరాజామెకు పట్టము గట్టెను. సుధ యిపుడు రాజ్యపాలనము చేయుచు నొకచిత్రకారుని బిలిపించి 'మే మొకస్త్రీని నీకడ కంపుదుము. ఆమె నొకమారు చూచి నాల్గుచిత్తరువుల తయారు చేయుము' అని వానికి తానే స్త్రీరూపమున గానుపించినది. అతడు తొందరగ లిఖించినచిత్తరువులను దెప్పించి యొక్కొక్కదాని నొక్కొక్కసత్రమున నుంచెను. దానిని జూచి యెవడుగాని, నవ్వినను తిట్టినను ఏడ్చినను వెంటనే వానికడకు తెమ్మనెను. భటుల నందు కాపుంచెను.

కొంతకాల మిట్లు జరుగ సుకుమారుడు, పోలిశెట్టి, దొంగలు, జంగమువచ్చి వేరువేరు నాచిత్తరువుల గాంచిరి. సుకుమారుడు విలపించె. పోలిశెట్టి నవ్వెను. దొంగ లేడ్చిరి. జంగము తిట్టెను. వీరినల్వురను రాజు యెదుట బెట్టిరి. విచారణసమయమున పోలిసెట్టి సుధాకరుడు తనకడకు హారము తెచ్చినది మొదలు సుధ పాతివ్రత్యమును జెప్పి యామె మహాపతివ్రతయని నమస్కరించి నవ్వెను. అంత జంగమును బిలిచిరి. అతడును జరిగినది చెప్పి యామె మహాయిల్లాలని లెంపలు వేసికొనెను. దొంగలు ఆమె కట్టియున్నంతకాల మింతో డబ్బు దొరికినదని యామె పోగానే మాపని డొల్లయినదని యేడ్చిరి. ఆతల్లిని చూపింతురా యనిరి. సుకుమారుడు సభాసమ్ముఖమునకు రాగానే సుధ తాళజాలక పురుష వేషమును దీసి వైచి నన్ను రక్షింపుడు. తమచరణదాసి నని సుకుమారుని పాదములపై బడెను. అత డామెను లేవనెత్తి తన మానమును కాపాడినదని ప్రకటించి పరిగ్రహించెను. అత్తమామ లానందించిరి. సుధాసుకుమారులకు పట్టాభిషేకోత్సవము జరిగెను.

అని చిలుక కథ ముగించెను. ప్రభావతికికూడ చిలుక చెప్పిన కథలలో వినయప్రవృత్తి, చాతుర్యత, రసవిజృంభణము, కార్యదీక్ష, నీతితత్పరత, ధైర్యస్థైర్యాది గుణనిరూపణము, యజమానియందు గల కృతజ్ఞత చాలవఱకు దేట తెల్లమయి నట్లుల నానాటి యామెముఖ చిహ్నాలనుబట్టియు, నడవడికలోని విభేదమునుబట్టియు కొంత కానిపించుచున్నది. ప్రతిదినంబును ప్రభావతి కథ యెప్పుడు ముగియునా యను నాలోచనలో నుండునది. నేడెట్లు కాక నింకను వినవలెనను గుతూహలమున నున్నట్లు గానుపించెను. అంతలో కాకులు కూసెను. ప్రభావతి స్వగృహంబున కేగెను.

సమాప్తము.

---

N. B. తరువాత ప్రభావతి తనప్రవర్తనము నెట్లు మార్చుకొనెనో యేమి జరిగెనో వెలువడబోవు 'కృష్ణపక్షకథానిధి' యను గ్రంథమున జూడగలరు.

# మదన కామ రాజు కథలు

## గ్రంథకర్త్రి:-- శ్రీమతి సుశీలా దేవిగారు.

భారతదేశంలో సమస్తస్థితిగతులు మారినటులే భాషలోగూడ మార్పులు వచ్చినవి. కట్టులో, జుట్టులో, బొట్టులో వచ్చినమార్పులు కావ్యాలలో, కవులలో, కథలలోగూడా వచ్చినవి. ఎందుల కింతగా చెప్పడం అంటే తెలుగులో మగవాళ్ళతోబాటు ఆడవాళ్ళుకూడ కథలు వ్రాయడం మొదలుపెట్టి కృతార్థురాండ్రు అవుతున్నారు. అందులో రసికుడు కలం పడితే కథలు ప్రవాహామువలె పాఱినటుల రసికురాలు కలం పడితే నడవదనే అపోహను చంపుతుం దీకథలసంపుటి. మదనవిజయుండును మంత్రిపుత్రుండగు బుద్ధిసాగరుండును రాజతిరస్కారంబున దేశాటనము చేయ మొదలిడి చిత్రభానుపురంబు చేరి యచట నొకదేవాలయమున నున్న స్త్రీవిగ్రహములను గాంచిరి. మదనవిజయుడావిగ్రహములను మోహించెను. వారి నెట్లయిన తోడ్తెచ్చి తనమిత్రునకు గూర్చునుద్దేశమున బుద్ధిసాగరుడాబొమ్మల చిత్రించిన చిత్రకారుని గలసికొని శివసాక్షాత్కార మంది కాంచనమాలామంజరు లను విజయంతీపురాధినాధుని కుమార్తెల పెండ్లియాడి వారితో గ్రీడింప నొల్లక నొక్కొక్కరి కొక్కొక్కరాత్రి యొక కథచొప్పున పండ్రెండుకథలను జెప్పెను. ఆకథలలోని లాలసము, అందచందములు, ఆకర్షణ, మొదలగునవి నీవు స్వయముగా చదివి తెలుసుకుంటే పన్నెండు రాత్రులు కేళీగృహములో రసానంద మనుభవిస్తావు. తుదకు బుద్ధిసాగరుడు కాంచనమాలను రాజపుత్రునకు వివాహము చేయించి తాను మంజరిని పెండ్లాడి యెంత సుఖముగా కాలమును వెళ్ళించి యేవిధముగా ధన్యులయారో తెలిసికొనుము. వెల రు 1—0—0.

---

కర్రా అచ్చయ్య అండ్ సన్సు, ఈశ్వర బుక్కుడిపో, రాజమండ్రి.

# తెనాలి రామలింగని కథలు.

గ్రంథకర్త:—డి. సోమలింగాచార్యులుగారు.

ఆంధ్రసారస్వతమునకు భాషాసేవ చేసిన ప్రాచీనమహాకవులలో నెందరో యొక్కొక్కవిషయములో పందె వేసికొనదగినవా రున్నారు. అందు శబ్దబుద్ధికి నన్నయ్య, భావపుష్టికి తిక్కన్న, అమోఘసూక్తికి భీమన్న, కవితాధాటికి శ్రీనాథుడు, వచోమార్దవమునకు పోతన్న, కవితాశక్తికి పెద్దన్న యిట్లే యెన్న వచ్చును. ఇంకను దిగ్గజములని పేరు పొందిన భట్టుమూర్తి, తిమ్మన మొదలగువారు కలరు. ఆనాటివారిలో తిట్టుకవిత్వం చెప్పి పండితులను, పామరులను, రాజులను తనతో వాదింప వచ్చిన యెదిరిపండితులను మెప్పించినవా డొక్క తెనాలిరామలింగడే. వికటకవియని నాటికి నేటికి ఖ్యాతి యాంధ్రసారస్వతములో నీతనికి నిలచియున్నది. తన్ను పోషించే రాయలనే యెన్నిమార్లో గౌరవముగా పరాభవించినాడు. సాటిపండితులకు పక్కలో బల్లెమై రాయలను దేశాంతరములనుండి చూడవచ్చిన కవితిల్లజులకు తోకచుక్కయై భాసిల్లినాడు. ఇతనిచరిత్రలో నున్నచమత్కార కథలవంటివి యెన్నేండ్లు ప్రయత్నించి యితరకవుల వాఙ్మయంలోనుండి వెలువరిద్దామని ప్రయత్నించినా భాషాసేవకుల కసాధ్యమనదని యంటారు. అందు ముఖ్యముగా రాయలను మెప్పించుటలో నీతని చరిత్రలోని ముఖ్యగాథలలో ప్రఖ్యాతినందినవి 35 కథలు యేర్చి పేర్చి కూర్చి తెలుగువారి కందించుచున్నాము. దానిలోని రసికత, సారస్యము, చమత్కారము, యుక్తిసౌలభ్యము, సమయస్ఫూర్తి, రంధ్రాన్వేషణము చేయుటలోని నేర్పరితనము తెలుగువారు గ్రహించవలెనంటే యొకమారీకథల నట్టిని తిరుగవేసిన ఆనందసముద్రములో నూగులాడుదురో, వికటకవితాసౌధమున వసింతురో యనుసంశయమును పాఠకలోకమునకే దానిని విడచి గ్రంథమును సాంతముగ నవలోకింపుమని విన్నవించుకొనుట మావిధి యని తలంచుచున్నాము. ముక్కాలురూపాయితో నీవు పొందే ఆనంద మెట్టిదో స్వయంగానే తెలిసికో!!

వెల రు 0—12—0.

కరా అచ్చయ్య అండ్ సన్సు, ఈశ్వరబుక్ డిపో, రాజమండ్రి.

